# ఆంధ్రపత్రిక

317568





The Andhra Patrika, Madras. } Regd. No M. 1118 Vol. 36 No 209 WEDNESDAY 2nd NOVEMBER 1949 వెల ఒకఅణా { Founder: K.NageswaraRao


# బందరు, దివి, గుడివాడ, కైకలూరు తాలూకాలకు విపరీతనష్టం

# కృష్ణాజిల్లాలో ఒకలక్షప్రజకు నిలువనీడ, తినతిండిలేదు

## బాధితుల సహాయానికి మచిలీపట్నంలో ఏర్పాట్లు

## నగరంలో 7 వేల ఇళ్లు కూలినట్లు మునిసిపల్ చెయిర్మన్ అంచనా

బందరు అక్టోబరు 31: తుపాను విజృంభణ కారణంగా, పశువులు, మేకలు, గొర్రెలు వందల సంఖ్యలో మృత్యుదేవతకు బలి అయినట్లు, జననష్టం కూడా హెచ్చుగా ఉన్నట్లు ఈ ప్రాంతంలోని ప్రతిగ్రామం నుండీ వార్తలు వస్తున్నవి. గాలివాన దెబ్బకైతేనేమి, గుడిసెలు ఉన్నట్టుండి కూలిపోవటంవల్లనైతేనేమి, కైకలూరు తాలూకాలోని తుమ్మిడి, రావిగుంట, పైఖాక, పెదగొన్నూరు, ఉప్పరగూడెం, సింగరాయి పాలెములలో మనుష్యులనేకమంది మృతి చెందినట్లు వార్తలవల్ల తెలుస్తున్నది. దివితాలూకా కోస్తాప్రాంతాల్లో కూడా ఎంతోమంది చనిపోయినట్లు, దివి, బందరు, కైకలూరు తాలూకాలలో వేలకొలదీ కుటుంబాలు నిలువనీడ, తినతిండిలేక అల్లాడిపోతున్నట్లు కూడా తెలుస్తున్నది.

ఈ మూడు తాలూకాల్లోను, వరిపైరులన్నీ పూర్తిగా నీటిలో మునిగివున్నవి. కోతలలో వున్న, బసంగి, పన్నపట్టిన పాలకుర్లు నామరూపాలు లేకుండా నాశనమయ్యాయి. ఇప్పుడే వెన్ను వేస్తున్న ఇతర ధాన్యాలపంటలు కూడ బాగా దెబ్బతిన్నవి. మనుషులకు తిండి కరువు, పశువులకు మేత కరువు, ఈ ఏడాది తప్పదని ప్రతివారూ భయపడుతున్నారు. గత సాయంత్రంనుంచీ బెజవాడకు బందరునుంచి బస్సులు నడుస్తున్నవి. గుడివాడకు, దివి తాలూకాకు కూడా యివ్వాళనుంచీ బస్సులు నడుస్తాయట. బంటుమిల్లి రోడ్డు అనేకచోట్ల గండ్లు పడటంవలన, కాలవలపై వంతెనలు కూలిపోటంవలన, ఆ వైపుకు బస్సులు పోవటం సాధ్యంకాదు.

బందరు దేశాయిపేటలో 27 వ తేది రాత్రి గుడిసెకూలి ఒక పశువాడు మరణించాడు. అదేరాత్రి కోటరోడ్డుమీద గాలివానకు ఒక స్త్రీ మరణించినది. ఈ వార్తలను అధికారులు ధ్రువపరిచారు. ఇంపీరియల్ బ్యాంకివద్ద స్పృతితప్పి పడివున్న ఒక వృద్ధయువను మునిసిపిల్ పోలీసువారు రక్షించి ఆస్పత్రిలో చేర్చారు. అతడు కోలుకొంటున్నాడు.

పెడనలో ఆరుగురు మరణించారు. ఇంగువ ముస్లిము గోడలుకూలి చనిపోయారని అధికారులు ధ్రువపరిచారు. పెడనలో ఒక కాఫీహోటలును "సందిట్లో పడేమియా" అని దొంగలెవరో లూటీ చేశారు. పోలీసులు, ఈ కేసును దర్యాప్తు చేస్తున్నారు.

### జపాన్ బాధితులకు సహాయం
### బందరు పురపాలక సంఘం ఏర్పాట్లు

బందరు అక్టోబర్ 31 తుఫాను బాధితులకు సహాయం చేసేందుకు, కృష్ణాజిల్లా కలెక్టరు జె. శాస్త్రి గారు మొన్నటిదినం వివిధ శాఖల అధికారులను మునిసిపల్ కార్యాలయంలో సమావేశం చేశారు.

పట్నంలో బందరు కోట పెద్దదైన 15 కేంద్రాలలో తల దాచుకున్న బాధిత ప్రజానీకానికి లారీలలో అన్నం తీసుకువెళ్లి అధికారులు పంచి పెట్టారు. వివిధ ప్రాంతాలకు అగ్ని మాపకదళం వారి ఇంజనులలో మంచినీళ్లు చేరవేయబడినవి. స్థానిక పౌరుడు ఎల్. నరసింహా రావుగారు యిచ్చిన నూనె యింజనుతో పట్టణానికంతటికీ నిన్న సాయంత్రం నుంచీ మంచినీరు పంపు చేయబడుతున్నది.

బాధితులకు సహాయపు ఏర్పాట్లు చేయడానికి డా॥ ఆర్. అచ్యుత రామయ్య గారి అధ్యక్షతన గత సాయంత్రం పురపాలక సంఘ ప్రత్యేక సమావేశం జరిగింది. కమీషనరు గారు తుపాను వినాశనాన్ని గూర్చి నివేదిక తయారు చేసి సమర్పించారు. అందులో ప్రజలకు మునిసిపాలిటీకి కలిగిన నష్టం 1938, 1945లలో కంటే ఎక్కువగా ఉన్నట్లు వర్ణింపబడింది. బాధితుల సహాయార్థం వెయ్యి రూపాయలు, మునిసిపల్ షాక్ పాంగ్రం, నొక్క

(4వ పేజీ చూడుడు)

## గుంటూరు జిల్లాలో తుపాను

### రేపల్లెలో ఆలయం గర్భగుడి కూలుట

రేపల్లె, అక్టోబరు 30: ఇచ్చట 27 న ఉదయము గాలివాన ప్రారంభించి మధ్యాహ్నమునకంటె రాత్రికి ఎక్కువయి విపరీతమైంది. ఇండ్లు కూలిపోయినవి. చాలా చెట్లు పడిపోయినవి టెలిఫోనులు, టెలిగ్రాములు ఆగిపోయినవి. బస్సు ప్రయాణమున్నూ ఆగిపోయినది. 27 న రాత్రి రేపల్లెనుండి బయలుదేరిన రైలు కల్లూరు రోడ్డు స్టేషను వరకు వెళ్ళి మరునాటి మధ్యాహ్నమువరకు అక్కడ ఆగిపోయినది. బండి ఆగబోవు సమయములో ఒక చెట్టువిరిగి బండి చివరిభాగములో పడినది. నష్టములేదు; కల్లూరు రోడ్డు, జంపని తెనాలి స్టేషనుల పైకప్పులుకూడా లేచినవి. మార్గమంతయు చెట్లతో నిండినది. భట్టిప్రోలు, పెనుముదులవద్ద నీరు పైరులను ముంచివేసినది. కాలవలు తటాయించినవి. ఈరోజుకూడా వర్షము కురియుటచేత రైతులు చాలా భయపడుచున్నారు. పైరు పొట్టమీద వుండుటవల్ల చాలా నష్టమని తలంచుచున్నారు. ఈ గ్రామము మిక్కిలి పల్లమైనందున రోడ్లమీద కూడా నీళ్లు నిలిచివున్నవి. పంచాయతీబోర్డు ప్రసిడెంటు శ్రీ వెంకటరమణగారు స్వయముగా దగ్గరవుండి ఈరోజు వుదయంనుండి నీరు బయటకుపోవు సదుపాయములు చేయించుచున్నారు. స్థానిక ఉమామహేశ్వర ఆలయము గర్భగుడి ఈ గాలివానకు కూలిపోయినది.

### తెనాలి తాలూకాలో నష్టం

"ఆంధ్రపత్రిక" తెనాలి విలేఖరి ఇట్లు వ్రాసెను.

ఈ తాలూకాలో తుపానువల్ల చాలా గ్రామాలలోని బీదల పూరియిండ్లున్నూ తుంగభద్ర ముంపువల్ల యడ్లపల్లి జాగర్లమూడి వగైరా హరిజనవాడలలోని పూరియిండ్లు పూర్తిగా నాశనమైనవి. అరటి తోటలు, పసుపుతోటలు నాశనమైపోయినవి. సుమారు 25 లక్షలు నష్టము వాటిల్లినది. ఈరోజు తెనాలినుండి డిప్యూటీ కలెక్టరు జి. రామమూర్తి పంతులు తహసీలుదారు యం. సత్యనారాయణ, గుం॥ జి॥ కాంగ్రెసు అధ్యక్షుడు ఆలపాటి వెంకటరామయ్య చౌదరి నారాయణ, పాలకుసంగయ్య మొదలగు వారు తుపానుప్రాంతాలకు వెళ్ళి చూచివచ్చినారు. ఇంకా తుంగభద్రా ప్రవాహము తగ్గలేదు. జిల్లా వ్యవసాయశాఖ ఆఫీసరు డిమానిస్ట్రేటరు వైకె కర్రు నీటిముంపుకు లోనయిన తోటలను పరిశోధించుటకు జాగర్లమూడి అంగలకుదురు యడ్లపల్లి వగైరా గ్రామాలకు వెళ్ళిరి.



తొలిస్వాగతం: విమానందిగుతూఉండగా భారతీయవిద్యార్థిని ప్రధానికిపూలమాల వేసింది



చికాగో నగరం, మేయరు మార్టిను కెన్నెల్లీగారి స్వాగతం



ఇండియాలో స్వాతంత్ర్యదినమున రెండేండ్లక్రిందట పుట్టిన ఒక పులి పిల్లను, ప్రధాని నెహ్రూగారికి ఒట్టావా వింతలో ఒకరు చూపుట.

## బుడమేరు వరదలవల్ల కలుగుతున్న అపారనష్టం

### ఈ ఏరును అదుపులో పెట్టేందుకు ప్రభుత్వం ఇకనైనా పూనుకోవాలని కళా వెంకట్రావుగారి ప్రకటన

విజయవాడ, అక్టోబర్ 31: కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకటరావుగారు కృష్ణాజిల్లాలో తుపానుదెబ్బకు గురిఅయిన కొన్ని ప్రాంతాలు చూసి ఈ దిగువ ప్రకటన చేశారు. శనివారం తెల్లవారు ఝామున 1 గంటకు డోర్నకల్లునుంచి విజయవాడ స్టేషను చేరేసరికి కటిక చీకటి ఆవరించి వుంది. అయితే ప్లాట్ ఫారంమీద నిలబడడానికైనా జాగాలేకుండా జనంవున్నారు. మదరాసుకు తప్ప మరెక్కడికి రైళ్లు పోవడంలేదని, టెలిగ్రాఫ్, టెలిఫోన్ సౌకర్యాలు ఎక్కడికీ లేవనీ తెలిసింది. అయినా నా స్వస్థానము నియోజక వర్గమూ తుపాను దెబ్బకు అధికంగా గురిఅయినదని తెలిసి ఎట్లాగో అట్లా అక్కడికి వెళ్ళాలనుకొన్నాను. కాని మూడురోజుల వరకూ ప్లాస్టే బండి అయినా పోదని రైల్వే అధికారులు చెప్పారు. అందువల్ల రోడ్డు మార్గాన పోదామని తలపెట్టి, ఒక స్నేహితుని కారులో ముందు ఏలూరు రోడ్డున బయలుదేరాము. 8 వ మైలు చేరేసరికి కారు ఆగిపోవలసి వచ్చింది. మా ముందు కనుచూపుమేర అంతా జలమయమై కనిపించింది. నీరు భూమిపై 6 లేక 8 అడుగులు ఉంటుంది. ఉండి ఉండి మృతకళేబరాలు కొట్టుకుపోవడం కనిపించింది. మేము వెనక్కు తిరిగి విజయవాడవచ్చి, బందరురోడ్డుమీద బయలుదేరాము. రోడ్డంతా గంటలుపడి గుతుకులుగా వుంది. ఎలెక్ట్రిక్ స్తంభాలు చాలా పడిపోయాయి. పెద్ద పెద్ద వృక్షాలు కూకటివేళ్ళతో పెగిలి, రోడ్డు మీద పడ్డాయి. హైవేస్ ఉద్యోగులు మార్గంలో అవరోధం లేకుండా చేసేందుకే, వాటిని వేలం వేస్తున్నారు. పామర్రుదాకా వెళ్ళాక, గుడివాడ రోడ్డు పుచ్చుకున్నాము. ఆ రోడ్డుమీదకూడా చాలా చోట్ల నీళ్ళు ప్రవహిస్తున్నాయి. రోడ్డు పక్కనే పడివున్న శవాలను కుక్కలు పీక్కుతింటున్నాయి. ఆ దారిలోని ప్రతి ఊళ్ళోను వందలకొలదీ పాకలు ఎగిరిపోయాయి. గోడలు పడిపోయాయి. ఆకలితో నకనక లాడుతున్న పిల్లలు దీనంగా చూస్తూ నిలబడటం కనపడింది. గుడివాడలో రైల్వేస్టేషన్ నిర్మానుష్యంగా వుంది. అక్కడ్నుంచి, ఏలూరు, కైకలూరు వెళ్ళేరోడ్లు నీళ్ళల్లో మునిగిపోయాయనీ, బండ్లుకూడా పోయే వీలులేదనీ తెలిసింది. వరిపైరు పూర్తిగా నీట్ల మునిగిపోయింది.

ఇదివరలో వచ్చిన 3 తుపానులు నేను స్వయంగా చూసి, సహాయ కార్యాలలో పాల్గొన్నాను కూడా. కాని ఇంత విస్తారమైన నష్టానికి పరిహారం కలిగించడం ఏ ఒక వ్యక్తికీ, సంస్థకూ సాధ్యమైనది కాదు. బుడమేరును గురించికూడా ఇది వరకు నేను విన్నాను. నేను మంత్రిగా వున్నప్పుడు ఈ ఏరువల్ల ప్రతి ఏడాది ఈ జిల్లా రైతులకు కలుగుతున్న నష్టంగురించి ఎన్నో అర్జీలు, స్థానిక ఎం. ఎల్. ఏ. కోరికలు విన్నాను. నేటి అనుభవాన్ని బట్టి ఈ ఏరును అదుపులో పెట్టకపోవడం, ఈ వరదలను అరికట్టకపోవడం, ఇంతకు సరిగా పూనుకోవకపోవడం మహాపాప మనిపించింది.

సంఘసేవాసంస్థలు, ప్రభుత్వం వెంటనే సత్వర సహాయం ఏర్పాటుచేసి, ఇక ముందు ఇట్టి ముంపులు సంభవించకుండా చర్యలు తీసుకోవలసివున్నది. ప్రస్తుత నష్టం భర్తీచేయడానికి ప్రభుత్వమూ, ప్రజలూ ఎంత బుద్ధిపూర్వకంగా పనిచేసినా అట్టే ఫలితం వుండదని నాకు తెలుసు. బాధితులయిన ప్రజలు తిరిగి ఇళ్లు వేసుకొని తమ పనిపాటులు మొదలుపెట్టడానికి కొన్ని లక్షల రూపాయలు అవుసరం. ప్రభుత్వం లాంఛనపు నివేదికలు, పరిశీలనలు కోసం చూడక విస్తారంగా సహాయం చేయడం ప్రారంభిస్తుందని ఆశిస్తాను. నేను పశ్చిమ, తూర్పు గోదావరిజిల్లాలు కూడా చూసి, నవంబరు 6 వ మద్రాసు చేరి ప్రధానికీ, మంత్రులకూ నివేదికలు అందచేస్తాను.

### తేలప్రోలులో 36 ప్రాణాల ఆహుతి

తేలప్రోలు (గన్నవరం తా॥), అక్టోబరు 30: ఈ గ్రామములో 27 వ తారీఖు రాత్రి 28 వ తారీఖు తుపానువల్ల పెద్దగాలి, వాన విపరీతముగావచ్చెను. ఏలూరు కాల్వపొర్లి గట్టుతెగెను పూరిండ్లన్నియు పడిపోయినవి. యిప్పటికి సుమారు 36 స్త్రీపురుషులు చనిపోయినట్లు శవగుర్తింపువల్ల తెలిసినది. సుమారు 2000 యిండ్లు పడిపోయినవి. పశువులు సుమారు 500 చనిపోయినది. జనము నిల్వనీడలేక అల్లాడిపోవుచున్నారు. ఈ గ్రామములో 2 పెద్ద రైసుమిల్లులు, 2 చిన్నమిల్లులు, 1 పెరుశెనగమిల్లు వున్నవి. ఇవన్నీ కూలిపోయినవి. ప్రస్తుతము కట్టుచున్న సినిమాహాలు పడిపోయినది, పూరియిల్లు అనటలేదు కొన్ని సామానులు కొట్టుకుపోయినవి. సుమారు 3 లక్షలకుపైగా నష్టముగల్గినట్లు అంచనా వేయబడినది.

### కనుమూరులో ప్రాణనష్టం

కనుమూరు (గుడివాడ తా॥) అక్టో 31:- ఈ గ్రామములో 27 వ తేదీ రాత్రి తుపాను వలన ఒక యింటిలో 8 గురిపై గోడలుపడి వారిలో యలమంచిలి సీతామహాలక్ష్మమ్మ అనే స్త్రీ వెంటనే మరణించినది. (వయస్సు 35) లక్ష్మి అనే మరొకామెకు బలమైన దెబ్బలు తగిలినవి తలివారి వారిని యితరులు బయటికి తీసి రక్షించారు. 25 పశువులు చనిపోయినవి బీదజనులు కాపురముండు 100 పాకలు పడిపోయినవి. ఈ విధముగనే జిల్లా అంతట బీదప్రజలు నిలువనీడలేక, తినతిండిలేక అలమటించిపోవుచున్నారు వెంటనే ఈ బీదప్రజలకు ప్రభుత్వమువారు, ప్రజలావిరివిగా సహాయము చేసి కాపాడవలసినదిగా కోరుచున్నాము. అని జి. కాం. సభ్యులు, యలమంచిలి వెంకటేశ్వరరావు గారు వ్రాశారు.

### చిరివాడలో

చిరివాడ గ్రామంలో వరదల వల్ల నష్టము కలిగినది. వేశేరు గ్రామములో 25 కుటుంబములు సర్వనాశనమైనట్లు తెలియుచున్నది. పొట్టిపాడు, ఉత్తూరు, గుడ్లవల్లి, బండారుగూడెం, కోడూరుపాడు మొదలగు గ్రామములలో వరదల్ల అపారనష్టము గలదు. కాని జననష్టమున్నట్లు తెలియలేదు. పశునష్టమున్నది. పైరులు పూర్తిగా దెబ్బతిన్నవి.

# చీరాలకు మద్యనిషేధ మంత్రి ఆగమనం

## పురపాలకసంఘంచే సన్మానపత్ర సమర్పణ

చీరాల, అక్టోబరు 28: ఈ పాటను యీదురుగాలి వీస్తున్నను వర్షము కురుస్తున్నను మద్రాసు మద్యపాన నిషేధమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, గుంటూరు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు ఆలపాటి వెంకట్రామయ్య, అన్నాప్రగడ కామేశ్వరరావు బాపట్ల తహసిల్దారు గార్లతో నిన్న సాయంకాలము యిక్కడకు వచ్చారు. మంత్రిగారికి పురపాలకసంఘం తరఫున మ్యునిసిపల్ బాలికా ఉన్నత పాఠశాలలో స్వాగతపత్రమును అధ్యక్షులు అన్నదాత నాగేంద్రుడుగారు చదివి సమర్పించారు. చీరాలకు విద్యుచ్ఛక్తి తెప్పించుటకును, కాలేజీ స్థాపించుటకును, మంచి నీటివసతులు, ఏర్పాటుచేయుటకు గ్రాంటులను మంజూరు చేయించవలసిందనీ, చీరాలలో సిమెంటురోడ్డు నిర్మించుటకు గ్రాంటులను మంజూరు చేయించవలసిందనీ విజ్ఞప్తి చేశారు. మంత్రిగారు తనకు గావించిన సన్మానమునకు కృతజ్ఞతదెల్పి అన్నిపట్టణములకు అన్ని సౌకర్యములు, ఏక కాలములో నీ ప్రభుత్వ హయాంలోను జరుగలేదనీ ఓపికపట్టిన అన్నీ గాకపోయినను కొన్ని కోర్కెలైనను నెరవేరగలవనీ అన్నారు. చీరాలకు ఎలక్ట్రిసిటీ మంజూరు అయినట్లు తెలియుచున్నదన్నారు.

తదుపరి మంత్రిగారికి, వారితో వచ్చిన వారికి అల్పాహారవిందు గావింపబడెను. కమీషనరుగారి ధన్యవాద సమర్పణముతో సభముగిసినది.

### గ్రంథాలయ ప్రారంభోత్సవము

మంత్రిగారు సపరివారముతో వర్షంలోనే జాండ్రపేటకుపల్లి అక్కడ జాండ్రపేట పంచాయతీ బోర్డువారిచే నూతనముగా నిర్మింపబడిన గ్రంథాలయ భవనమునకు ప్రారంభోత్సవము జరిపారు. బోర్డు అధ్యక్షులు బండారు శివప్రసాదరావుగారు మంత్రిగారికి స్వాగతపత్రము చదివి సమర్పించారు. మంత్రిగారు పరివారముతో రాత్రిగుంటూరు వెళ్ళారు.

### వినుకొండ తాలూకాలో పర్యటన

తెనాలి అక్టోబరు 29: మదరాసు గృహనిర్మాణశాఖామంత్రి నీలంసంజీవరెడ్డిగారు 26వ తేదీ ఉదయం మెయిలులో మదరాసు నుండి ఒంగోలుకు వచ్చిరి. సం॥ జి. కాంగ్రెసు అధ్యక్షులు ఆలపాటి వెంకట రామయ్య కార్యదర్శి ఆర్. వీరారెడ్డి, స్థానిక ప్రభుత్వోద్యోగులు మంత్రిగారికి స్వాగత మొసంగిరి. ఉదయం 9 గం॥ లకు మంత్రిగారు అక్కడి నుండి గనుకొండకు విచ్చేసిరి. అక్కడ మంత్రిగారి గౌరవార్థం పౌరులు అల్పాహార విందుగావించిరి. విందు అనంతరం మంత్రిగారు సపరివారంగా కనుమల చెరువు ఇలాకా గాంధీ నగరుకు వెళ్లిరి. అచ్చట రెడ్డి యానాదుల సంఘం వారు 240 కుటుంబముల వారు మంత్రి గార్కి వినతి పత్రము సమర్పించిరి. మంత్రిగారు సమాధాన మొసంగుచూ ప్రస్తుతం ప్రభుత్వానికి భూమి యొక్క ఫల సాయము నభివృద్ధి చేయుటకే గాని విస్తీర్ణము నెక్కువజేయు నుద్దేశ్యము లేదనియు, అందుకై జమీందార్ల వద్ద నుండి కూడ భూములకు నుపరాయిచ్చి, పేద రైతులకు వ్యవసాయమునకిచ్చు సంకల్పము కలదనియు నుడివిరి. అడవులను నరకి బీళ్లుగా మార్చుటవల్ల వర్షపాతము తగ్గుటయే గాక వర్షించిన నీరంతయూ సముద్రము పాలగుననీ, పంటలకు సైతమూ దెబ్బ తగులుననీ, అందుచే అడవులను నరకి ఆ భూమిని సేద్యముకు కిచ్చుటకు ప్రభుత్వం వారు ప్రోత్సహించరనీ, నుడివిరి. సభకు కాసు బ్రహ్మానంద రెడ్డి గారు అధ్యక్షత వహించిరి.

పిమ్మట మంత్రిగారు కనుమలచెరువు గ్రామమును సేద్యమునకుగాను కోరబడిన భూమినిన్ని చెరువులను పరిశీలించి మధ్యాహ్నం 1 గంటకు వినుకొండకుచేరి స్నానానంతరం పమిడిపాడు గ్రామములో అటకి పంచాయతీ క్రింద సేద్యమునకు కోరబడిన భూములను చూచుటకై వెళ్లిరి. మంత్రిగారితోకూడ మంతెన వెంకట రాజు ఎం. ఎల్. ఏ. పెదూరి నాగేశ్వరరావు ఎం. ఎల్. ఏ. గార్లు జిల్లాలోని రెవిన్యూ అధికారులు అటవీ, పోలీసు అధికారులు వెళ్లిరి. వినుకొండలో సాయంకాలం 6 గంటలకు పంచాయతీబోర్డువారు మంత్రిగారికి సన్మానపత్రము సమర్పించిరి. అనంతరం మంత్రిగారు రాత్రి 8 గంటలకు నర్సరావుపేటకు చేరిరి. రాత్రి నరసరావుపేట పురపాలక సంఘంవారు సమర్పించిన సన్మాన పత్రము ... స్థానిక కాంగ్రెసు నాయకులు కాసు బ్రహ్మానందరెడ్డిగారింట మంత్రిగారు వారి పరివారము భుజించిరి. మరునాడు ఉదయం సత్తెనపల్లి తాలూకాలోని వెంకటాపురంలో అడవిని పరిశీలించుటకై వెళ్లిరి.

# సంపాదక లేఖలు

## కుందేరు తూర్పుప్రాంతానికి నీటి సప్లయి

ఆర్యా!

బాపట్ల తాలూకా, చీరాల ఫిర్కాలో కుందేరుకు తూర్పుభాగమునగల, యితర ప్రాంతమునకు, నీటి సరఫరా చేయించవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారికి అనేకసార్లు దరఖాస్తులు పెట్టుచూ, లెవల్సు మా స్వంత ఖర్చులతో తీయించి పంపియున్నారము. తెనాలి యిరిగేషన్ కాన్ఫరెన్సులో స్కీమునుచూచి ఆలోచించవలయునని తీర్మానించినారు. యింతవరకు ఏమియు చేయలేదు.

ప్రభుత్వమువారు ఇరిగేషన్ స్కీములు త్వరగా పూర్తిచేయవలయును అని పేపర్లలో వ్రాయుటేగాని, పని మాత్రము సాగింపు నట్లుగా కనబడుటలేదు.

ప్రభుత్వము వారు దయయుంచి, త్వరగా స్కీమునుచూచి, శ్రద్ధ తీసికొనవలసినదిగా మనవి.

రావిపాటి పుల్లయ్య,
చీరాల ఫిర్కా రైతు కాంగ్రెస్ సంఘ
కార్యదర్శి.

* * *

## నాదస్వరగాయకులు: కర్ణాటక సంప్రదాయం

సంగీత కళా ప్రపంచమున కర్ణాటక సంప్రదాయ ప్రాధాన్యం గురించి ఇప్పుడు వేరే చెప్పనక్కరలేదు. ఆంధ్ర నాదస్వరగాయక యువకులు ఇలాంటి ఉత్తమ సంప్రదాయమును విసర్జించి సినిమా పాటలనే ప్రాధాన్యంగా పెట్టుకొనుటవలన చాల అగౌరవము కలుగుచున్నది. అరవ దేశస్థులు ఉత్తమ సంగీతమును తామే ప్రదర్శించాలి గాని ఆంధ్రులకు ఆ యోగ్యత లేదని అనేందుకు అవకాశం ఇంపు వరాలంగా, ఇస్తున్నారు. ఇందుకు భిన్నంగా కర్ణాటక సాంప్రదాయమునే అనుసరించుచు. తమిళ, కర్ణాటక దేశములలో కూడా ప్రఖ్యాతి వహించిన మహనీయులు దాలిపర్తి పిచ్చహరి, షేక్ చిన పీరు సాహేబ్ గార్ల లాంటి కొద్ది మంది మాత్రమే కనుపించుచున్నారు. కావున ఆంధ్ర నాదస్వర గాయక యువకులందరు, ఇప్పటికైనా ఈ విషయమును గమనించి, ఉత్తమ కర్ణాటక సాంప్రదాయమునే అనుసరించి, ఆంధ్రుల గౌరవము కాపాడగలరని ఆశిస్తున్నాను.

గుంటుపల్లి రామమూర్తి
తెనాలి.

* * *

## ఆయుర్వేద వైద్యులు - రిజిస్ట్రేషను

గ్రామీణవైద్యుల రిజిస్ట్రేషన్ అవకాశమును రద్దుచేస్తూ ప్రభుత్వమువారు జీ. ఓ. ను ప్రకటించిరనెడి వార్త ఆయుర్వేద వైద్యుల కెల్లరికి ఆందోళనను కలిగించినది. ఇంతవరకు సుమారు 13 వేల మంది వైద్యులను రిజిస్టరు చేసియున్నారు. రిజిస్టరు కావలసినవారు ఈ రాష్ట్రమున సుమారు 20 వేలకు పైగా కలరు. వీరిలో అనువంశిక వైద్యులు, శాస్త్రీయ వైద్యులు, పండితులు, శస్త్రవైద్య సహాయము పేక్షింపకనే అతి సులభముగా చౌకగా కొన్ని రోగములను నివారణ చేయు సామర్థ్యముగలవారు కలరు. రిజిస్ట్రేషను అవకాశము గ్రహించక, ఖర్చులు భరించలేక పల్లెటూళ్లలో నివసించుటవలన ఎ, బి, క్లాసుల తరగతి విభేద ప్రచార సూచనలు, చాలమంది గడువులోగా రిజిస్ట్రేషన్ చేయించుకొనలేకపోయిరి. ఇట్టి స్థితిలో ప్రభుత్వం ఆయుర్వేద ప్రాశస్త్యమును గ్రహించి, దాని వృద్ధిని కోరినచో ప్రాక్ విధానవాదు వైద్యులందరిని నిర్భంధముగా రిజిష్టరు చేయవలెనని తెలిపియున్నారు. దీనిని గణించకయే ప్రభుత్వమువారు యిట్టి ప్రకటన చేయుట చాల విచారకరము; యిట్టి స్థితిలో, ఆయుర్వేద వైద్యులు సంస్థలు, రిజిష్టరుకాని దేశీయ వైద్యులకు ప్రభుత్వమువారు త్వరలో మరియొక అవకాశము నొసంగునట్లు చేయవలెనని కోరుచున్నాను.

అల్లెన దామోదర రావు,
పాలకొండ.

* * *

## చేనేతవారి ఇబ్బందులు

ఆంధ్రదేశంలోగల చేనేత కేంద్రములలో చీరాల కేంద్రం ప్రధానమైనది. ఇక్కడా, ఈ చుట్టు గ్రామములలోను 7000 చేతిమగ్గాలున్నవి. 30,000 లకు పైగా ప్రజలు చేనేత పరిశ్రమపై ఆధారపడి జీవిస్తున్నారు. ఇటీవల మిల్లుబట్టల దిగుమతి ఎక్కువై చేనేతవస్త్రాల విక్రయాలు తగ్గినవి. పెట్టుధరలు సగానికి సగం పడిపోయినవి. ఇటు నూలుధరలు పెరిగినవి. ఇందువల్ల మాస్టరువీవర్లకు సరియైన గిట్టుబాటు లేక నేతవారి మజూరీలు తగ్గించడం ప్రారంభించారు. కొందరు పని ఇవ్వడమే మాని వేస్తున్నారు. ఇందువల్ల ఎంత తక్కువ మజూరీకి నేయడానికైనా చేనేతవారు సిద్ధపడవలసి వస్తుంది. లడ్డీ 1కి 0-4-0 చొప్పున నెలకు సగటున మగ్గం వినియోగించే 60 లడ్డీలకు వచ్చే నెలసరి ఆదాయం రు 15/- లు మాత్రమే వస్తుంది. ఇదిఒక్క మగ్గమునేసేవారి ఆదాయమని ఎంచుటకు వీలులేదు. మగ్గంపై ఆధారపడిన ఒక కుటుంబముయొక్క ఆదాయము. సాధారణంగా ఎంత పేద జీవితానికైనా ఈ గ్రామాలలో నెలకు రు 75/- లకు తక్కువ ఖర్చుగాదు. అదికాక చీరాలకేంద్రం పంటలుపండని మెట్టు ఇసుకప్రదేశం కావడంచేత ఆహారపదార్థాలన్నీ ఇతరచోట్లనుంచి రావలసినదే. అందువల్ల బియ్యం, కూరగాయలు వగైరా ఆహారవస్తువుల ధరలన్నీ ఇతర గ్రామాలకంటె హెచ్చుగ ఉంటున్నవి. ఈ పరిస్థితులలో చేనేతవారు మధ్యతరగతికి చెందిన ప్రజలుగా ఇంతవరకుజీవిస్తు అభిమానవంతులుగ ఉండడంచేత బయటికి చెప్పుకోలేకున్నా లోలోన అనేకబాధలు పడుతున్నారు. ప్రభుత్వం వెంటనే తగిన చర్యలు తీసుకొని చేనేతవారికి జీవనం కల్పించకపోతే పరిస్థితులు చాల అల్లకల్లోలమై హద్దు మీరగలవేమోనని అనిపిస్తున్నవి.

ప్రభుత్వం వెంటనే ఈ దిగువసూచనలు అమలు పరుచవలసిందని కోరుచున్నాను.

మద్రాసురాష్ట్రానికి విపరీతంగా దిగుమతి యగుచున్న మిల్లుబట్టలను కనీసం అరు మాసాలవరకైనా పూర్తిగా ఆపించవలెను. పందిళ్ళపల్లి, వేటపాలెం, జాండ్రపేట, చీరాల, పేరాల, ఈపూరుపాలెం, జిల్లాలోని ఇతర పెద్ద చేనేత కేంద్రములలోను ప్రభుత్వము సముష్టి నేతకేంద్రాలు ఏర్పాటుజేసి నిరుద్యోగులైన చేనేతవారందరికి పని చూపవలెను. ప్రస్తుతం వీసర్ల వద్ద చేనేత సహకార సంఘాలవద్ద నిల్వయున్న బట్టను ప్రభుత్వం గిట్టింపుధరలకు కొనవలెను. చేనేత సహకారసంఘాలలో పనిచేయుచున్న సభ్యులకు సంఘాలు ఇచ్చుచున్న మజూరీలకు తోడుగ ప్రభుత్వం ప్రతిలడ్డీకి రెండణాల మజూరీని అదనపు విరాళముగ ఇవ్వవలెను. నూలుధరలను కనీసం నూటికి 20 వంతులమేరకు తగ్గించవలెను. ప్రభుత్వావసరములకు చేనేత బట్టలను కొనవలెను. రూపాయివిలువ తగ్గించినమీదట విపరీతంగా ధరలను పెరిగిపోయిన రంగుల రసాయనిక ధరలు వెంటనే తగ్గించుటకై ప్రభుత్వము అవసర చర్యలను తీసికొనవలెను. చేనేత పరిశ్రమకు శాశ్వత రక్షణ కల్పించుటకై అన్నిరకముల చీరెలను చేనేత పరిశ్రమకు ప్రత్యేకించవలెను.

అన్నదాత నాగేంద్రుడు,
పురపాలక సంఘాధ్యక్షుడు.

* * *

## హోమియోపతి విచారణ సంఘం నివేదిక

హోమియోపతి విచారణ సంఘం వారి నివేదికలో విశేషముగా చెప్పబడిన వాటిలో అనేక ఖండనీయాంశములు కనబడుచున్నవి. ఈ వైద్య విధానముపట్ల గౌరవము, వైద్యుల లక్షణములపట్ల క్రమము వక్రమార్గముగా చూపినను, హోమియోపతియందు లేశమైనా నమ్మకము లేకపోయినా దీని నాచరించుచు, యితరత్రా రిజిష్టరు అయిన వైద్యులను ఉత్తేజపరచుచు, దీని విషయమై మంచి విజ్ఞానము, అనుభవము కలిగినవారి రిజిస్ట్రేషను కేవలము మాత్రమున హేయాలుగాను లెక్కించుట శోచనీయము.

వైద్యులను రెండు తరగతులుగా విభజించినను విస్పష్ట భేదమేమియు విషయమై అస్పష్టముగానే చేయుచూ కొంత తెలివిలేక వాడుకలో యిచ్చుచున్నారు. యీ సంఘనిరాకరము గాక చికిత్స చేయవచ్చును గాని ఆ విషయమై బాధ్యతవహించుటకు నిలుపుకొనుటకు న్యాయవిరుద్ధమే కాక అనుచితమైన కేటాయింపు, మొదలైనవి యున్నవి.

మొత్తముపైన ఈ ప్రచార్యార్యాకూనాలును ఉపయోగించవలసినదైన గవర్నమెంటువారు త్వరలో హోమియోపతియందు తమ విశ్వాసమును కలిగి నిలువనుండి ప్రోత్సహింపవలెను. ఈ వైద్య విధానమునకు వ్యాప్తి కలిగించుటకై కొన్ని ప్రత్యేక నియమములు ఏర్పరచి, వాటి ప్రకారము సంఘములు, ఆస్పత్రులు నెలకొల్పవలెను. ... (శ్వా. పి.)

మిగతా భాగము చదువుటకు వీలుగాని రీతిలో ఉన్నది.

గార్కి సహాయపడి, వారి సంస్థలను నిలబెట్టుకొనుటకు వలసిన పరిస్థితుల నేర్పరచుకోవలెను.

శ్రో. పి. ఎస్. పంతులు, విజయవాడ

* * *

## ఎర్రగొండపాలెం ఖాదీకేంద్రం

దుర్భిక్షము, దౌర్జన్యములకు, యుద్ధములకు లోనవీయయంత్ర మహాఘాతమును సాక్ష్యమైనంతవరకు దూరమునుంచి కనీసము అన్నవస్త్రములకు ఉత్పత్తిలోనైనను దానిని దరిజేరనీయకుండ చేయవలయునను, గాంధిమహాత్ముని సంకల్పానుసారముగ, ప్రకాశంపంతులుగారు ప్రధాని పదవిలో నున్నప్పుడు బట్టలమిల్లులను నిషేధించుటకు తత్స్థానమున రాట్నపరిశ్రమను నెలకొల్పుటకు పూనుకొనిరి. తత్ఫలితముగ రాష్ట్రములో కొన్నిచోట్ల ఖాదీకేంద్రములు ఏర్పాటయ్యెను. వాటిలో కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా ఎర్రగొండపాలెం కేంద్రం ఒకటి. ఈ కేంద్రమునకు ప్రకాశం పంతులుగారు స్వయముగ 1946 అక్టోబరు మొదటిలో ప్రారంభోత్సవము జరిపిరి. ఈ కేంద్రము క్రింద నున్న 18 గ్రామాదులలో ప్రతిఇంట రాట్నములుండుట ఆ రాట్నములమీద ఆఇంటివారు స్వయముగ వడికినసూలుతో, ఆ ప్రాంతమునగల, మగ్గములమీద నేసిన వస్త్రములనే ధరించుట, ఈ పనిసుస్థిరముగ సాగిపోవుటకు తగిన వాతావరణమును ఈ కేంద్రమున నియుక్తులైన ఖద్దరు ఉపాధ్యాయులు తమబోధనలవల్ల, స్వప్రవర్తనవల్ల సృష్టించుట ఈ కేంద్ర ఆదర్శము.

ఈ ఆదర్శమును సాధించుటకై ఖద్దరు ఉత్పత్తివిషయములో ఆరితేరిన అఖిల భారత చరఖాసంఘపు సిబ్బంది కొంత ఈ కేంద్రమునకు నియమింపబడెను. ఈ సిబ్బంది కేవలము జీతములకువచ్చిన, ఆఫీసర్లుగాక, ఈ పని సాధించవలెనను ఉత్సాహ విశేషముగలవారు.

మూడు సంవత్సరముల అనంతరము సింహావలోకనము చేయుగ యీ 18 గ్రామములలోను, స్వావలంబన ఖాదీవిధానాదర్శము సాధింపబడినదనియే స్పష్టమగుచున్నది. శ్రీ గాంధీ జయంత్యుత్సవ సందర్భములో ఈ కేంద్రము చేసినకృషిని ఇచ్చటిజనుల యుత్సాహమును కార్యదీక్షాదకులను, స్వయముగ కనుగొంటిని.

ఈ కేంద్రమున ఇట్టికృషి ఇంతఫలవంతముగ జరుగుచున్నదన్న సంగతి బయట ప్రపంచమువారికి తెలియకపోవచ్చును. దీనికి కారణము ఇచ్చటపని చేయు సిబ్బంది నిరాడంబరత్వమే. దీక్షతో పనిచేయు సిబ్బందియున్నచో గాంధిగారు సంకల్పించిన స్వావలంబన ఖాదీవిధానము ఫలవంతమైతీరునని ఎంతటి అపనమ్మకస్తులకైనను గోచరముకాగలదని ఈ కేంద్రము మూడేండ్లకృషి ప్రత్యక్ష సాక్ష్యమిచ్చుచున్నది. ఇతర డిపార్టుమెంటులలోకూడ ఇట్టి దేశసేవాదీక్షపరులున్నచో దేశమెంతో సౌభాగ్యవంతమగునని నాకు తోచినది.

ఈ సిబ్బందిని శాశ్వతముగ ఈ ప్రదేశములోనే ఉంచవలెనని ఆదిలో ఉద్దేశించలేదు, ఈ కేంద్రగ్రామములవారికి త్రోవచూపుటకు మాత్రమే వీరినినియమించిరి. ఈ మూడు సంవత్సరములలో ఈ పని జరిగినదని నా ఉద్దేశము. ఇకమీదట ఆయా గ్రామములవారే ఈ కార్యక్రమమును, తమ నిత్యధర్మముగ నిర్వహించుకొనవలసియుండును. అప్పుడే ఖాదీ స్వావలంబన విధానము స్వయంసహాయపద్ధతిని స్థిరపడగలదు. కనుక, ఈ సిబ్బందిని ఇంక వేరొక కేంద్రమునకు మార్చవలసిన సమయము వచ్చినదనికూడా నా యభిప్రాయము. స్వావలంబన విధానము అన్ని ప్రాంతములలోను వ్యాప్తినొందుట కీసిబ్బంది అవసరము.

మానికొండసత్యనారాయణశాస్త్రి



## టెండరు నోటీసు

దిగువలిస్టులో తెల్పిన పనులకు సీలు వేసిన టెండరు విశాఖపట్టణం మునిసిపాలిటీ కమీషనరుగారిచే వారి ఆఫీసువద్ద ది 3-11-49 సాయంత్రం 4 గంటలవరకు తీసికొనబడును: అవి వారిచే మునిసిపల్ ఆఫీసులో ది 3-11-49 సాయంత్రం 4-30 గం.లకు అప్పుడు హాజరైయున్న టెండరుదార్ల సముఖమున తెరువబడును. టెండరు వరతులు, టెండరు నోటీసు, ఇతర కంట్రాక్టు డాక్యుమెంట్లు ప్రతి ఒక్క పనికిని రు. 0-8-0 చెల్లించి మునిసిపల్ ఇంజనీరుగారి వద్దనుంచి ఆఫీసు పనిచేయు గంటలలో పొందవచ్చును.

| వరుస సంఖ్య | పని పేరు | డిపాజిట్టు | పూర్తిచేయుటకు అనుమతించిన వ్యవధి | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | టర్నర్సు సత్రంకు సాలుసరి మరమ్మత్తులు | రు. 195/- | 10 వారములు | |
| 2. | 1949-50 సం॥కు మునిసిపల్ ఆఫీసుకు సాలుసరిమరమ్మత్తులు | 100/- | 5 వారములు | |
| 3. | అల్లిపురంలోని దేవాంగులవీధిలో 3 అంగుళముల సిమెంటు కాంక్రీటు రోడ్డు వేయుట | 100/- | 5 వారములు | |
| 4. | మహారాణి పేటలో దేవాలయం వీధికి తూర్పు నుంచి పడమరకు సిమెంటు కాంక్రీటింగు చేయుట | 35/- | 3 వారములు | |
| 5. | మునిసిపల్ హైస్కూలుకు బేసు కొయ్య ఫర్నిచరు సప్లయి చేయుట | 180/- | 12 వారములు | |

మునిసిపల్ ఆఫీసు, విశాఖపట్నము,
ది. 13-10-49.
కమిషనరు.

# "మీ రందరూ ఆశీర్వదించి ఆదరిస్తే మరికొంతకాలం మీ సేవ చేస్తాను"

## పశ్చిమ పంజాబ్‌లో 150 మంది కాందిశీకుల చిత్రవధ

న్యూఢిల్లీ, అక్టోబర్ 31: పశ్చిమ పంజాబ్‌లో కాంబెల్‌పూర్ జిల్లాలో, కాందిశీక శిబిరంపై పాకిస్థాన్ 'గార్డ్స్' జులై 22 వ తేదీ ప్రాంతాల కాల్పులు జరిపారని, ఆ కాల్పులమూలంగా 150 మంది కాందిశీకులు మరణించారని, 32 మంది గాయపడ్డారని యిప్పుడు యిక్కడ అధికారవర్గాలద్వారా తెలియ వచ్చింది. ఈ శిబిరంలోని కాందిశీకులలో చాలామంది కాశ్మీర్ ముస్లింలే. పూంచ్ పట్టణానికిచెందిన రామఖా అనే ఆయన కుమార్తెపై పాకిస్థానీ ఒకడు దుర్మార్గం జరపడానికి పూనుకోగా, కాందిశీకులు ఆగ్రహావేశులై, శిబిరం అధికారి భవనంపై దాడిచేయగా అప్పుడు 'గార్డ్స్' కాల్పులు జరిపారట.

## కాశ్మీర్ సంస్థానరాజ్యాంగం

### ఆరునెలల్లో పరిషత్ సమావేశం:

### ప్రధాని షేక్ అబ్దుల్లా ఉద్ఘాటన

శ్రీనగర్, అక్టోబరు 31: జమ్మూ కాశ్మీర్ సంస్థాన భవిష్యద్రాజ్యాంగ చట్టమును తయారుచేయుటకు, ఆరునెలల్లో, రాజ్యాంగపరిషత్తు యేర్పాటు చేయబడునని, ప్రధాని షేక్ అబ్దుల్లా మొన్న శుక్రవారంనాడు వెల్లడించాడు

మహారాజా భవిష్యత్తును గూడా నిర్ణయించే అధికారం పరిషత్తుకు ఉంటుందని అబ్దుల్లా తెలియజేశాడు.

స్వారస్వత క్లబ్బులో కాశ్మీర్ ప్రధాని ఉపన్యసిస్తూ, భారతప్రభుత్వం చేసిన సహాయానికి కృతజ్ఞత వెల్లడించాడు.

"మేము పూర్తిగా అసహాయస్థితిలో ప... వ్పుడు, భారత ప్రభుత్వమువారు మమ్మురక్షించారు. వారిమేలు మేమెన్నటికీ మరువజాలము" అని అబ్దుల్లా అన్నాడు.

సంస్థానంలో ఆహారపరిస్థితిని గురించి తెలుపుతూ, ప్రజల రేషన్ ప్రమాణాన్ని హెచ్చించే విషయంలో ప్రభుత్వం త్వరలోనే ఒకనిర్ణయంచేయగలదని చెప్పాడు.

## పండిట్ నెహ్రూ

### నవంబరు 13 న ప్రధాని పునరాగమనం

బొంబాయి, అక్టోబర్ 31:—ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారు నవంబరు 14 న బొంబాయిలో తన 61 వ జన్మదినోత్సవమును జరుపుకొనునని బి. పి. సి. సి. ప్రధాన కార్యస్థానము వారు నేడు ప్రకటించిరి.

బొంబాయిలో జన్మదినోత్సవముజరుపుకొనవలసినదిగా బి.పి.సి.సి. వారు పండితుని, ఆయన అమెరికా కు బయలుదేరి వెళ్లుటకు పూర్వము ప్రార్థించి యుండిరి. అందుకు ఆయన యిప్పుడంగీకరించెనని తెలియుచున్నది.

## సర్దార్ పటేల్ ఉద్బోధ: 74-వ జన్మదినోత్సవసందర్భాన ఢిల్లీరాష్ట్రకాంగ్రెస్ సన్మానసభ

### "దేశ ఆర్థిక స్వాతంత్ర్య సాధనకు ప్రజలలో త్యాగబుద్ధి అవసరం"

న్యూఢిల్లీ, అక్టోబరు 31: భారతదేశం బాగా బలపడి శక్తివంతంగా తయారయ్యేదాకా మనం ఒకరి కాళ్లకు ఒకళ్లం అడ్డుపడటం తగిన పనికాదు అని సర్దార్ వల్లభాయ్ పటేల్ నేడు ఉద్ఘాటించారు.

ఢిల్లీ రాష్ట్రకాంగ్రెసు సంఘంవారు తన 74 వ జన్మదినోత్సవావసరంలో ఏర్పాటుచేసిన సన్మానసభలో మాట్లాడుతూ, "మనం హృదయ దౌర్బల్యాన్ని పెంచుకొన్నా, సంశయాత్ములమైనా ఏమీ లాభంలేదు. అసలు అట్లా మథనపడవలసిన అవసరం నాకు గోచరించడం లేదు. వ్యవహారాత్మకమైన బుద్ధితో మనం మనల్ని ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించుకోవాలి" అని అన్నారు.

అమెరికాలో పండిట్ నెహ్రూ పర్యటనాన్నిగూర్చిగూడా ఆయన ఈ సందర్భంలో ప్రసంగించారు. నాపని అల్లా ఒక్కటే. అది విదేశాల్లో మనజాతి గౌరవాన్ని నిల్పుతూవున్న మననాయకునికి అండగా నిలిచి ఆయన్ను బలపరచటమే నని ఆయన స్పష్టంచేసారు. తన యీ బొందెలో ప్రాణంవున్నంతవరకు తాను అలాగే చేస్తాననిగూడా ఆయన ఉద్ఘాటించాడు.

దేశం బహు సమస్యలను ఎదుర్కొంటున్నది. వీటిని పరిష్కరించడంలో ప్రజలందరు సహకరించాలని విజ్ఞప్తిచేస్తూ, మనం కష్టపడి పనిచేసి దేశంలో ఉత్పత్తిని ఎక్కువచెయ్యాలి. ఎక్కువగా పండించాలి. పొదుపుగా వాడుకోవాలి, దుబారా పనికిరాదు. ఇవి ప్రతివారినడవడికకు తలకట్టుగా వుండాలి. అని సర్దార్ పటేల్ హెచ్చరించారు.

దేశాన్ని అభివృద్ధి ముఖంగా నడపడం అనేది తేలికయైన పనికాదు. అందుకు ప్రజలు చాలా కష్టాలుపడాలి. కత్తివాదం మీద సాముచేయాలి. ఒక్క అడుగు తప్పితే, గోతిలోనే పడిపోవడం.

నాజీవితం అంతా అయిపోయింది. ఇండియాలో 74 ఏండ్లు బ్రతకటమంటే ఒకపెద్ద గొప్పే. కానీ మీరు నాయందు చూపుతున్న ప్రేమ, ఆదరం, అభిమానం నాకు బ్రతుకు మీద ఆశను పెంచుతున్నాయి. నేను బ్రతికి మీయీ ప్రేమకు, ఆదరానికి అభిమానికి బదులుకు బదులు తీర్చుకోగలట్లు చేయవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

ఈ నాజీవితంలో నేనుచేయగల పని ఒక్కటే ఉంది. అది మన నాయకుడైన జవహర్‌లాల్‌ను బలపరచటమే. నాకంఠంలో ఊపిరి ఆడినంతవరకు నేను అట్లా చేస్తాను. ఆయన మనజాతిగౌరవాన్ని, మన దేశంప్రతిష్ఠను విదేశాలలో ఇనుమడింపజేస్తున్నారు.

పరదేశాల్లో మనప్రతిష్ఠ ఇంత ఇదిగా అలుముకు పోయిందంటే దానికి కారణం గాంధీజీ జీవన్మరణాలు రెండు కారణాలైనాయి. ఆయనబ్రతికిన బ్రతుకునుచూచి ప్రపంచం తేజెలుపల్కింది. ఆయనమరణాన్ని చూచి ప్రపంచం నిద్రమేల్కొన్నట్లు లేచి, యదార్థమైన ఆయన జీవితపరమార్థాన్ని అర్థంచేసుకున్నది.

ఇప్పుడు మన నాయకుడు ఆదేశాల్లో మన గౌరవాన్ని, ప్రతిష్ఠను నిల్పడానికి అవిరళ కృషి చేస్తున్నారు.

కాని బయటి ప్రపంచంలో మన గౌరవం నిలవాలి అంటే అంతకు ముందు మనం మన ఇంటిని చక్కబెట్టుకోవాలి. మన దేశంలోనే మనకు గౌరవమర్యాదలు లేకపోతే, ఇతర దేశాల్లో అవి మనకెట్లా వస్తాయి? కష్టంలోనూ, సుఖంలోనూ గూడా మన్మల్ని తెగనే జనం దేశంలో బాగా తయారయింది. ఇప్పటి కంటే బ్రిటిష వాళ్ళ క్రిందనే బాగా వున్నదరా! బాబూ! అనే రకం గూడా కొంత దేశంలో కనపడుతోంది. అటువంటి వాళ్లు మన మధ్య మెసలుతూ వుండటం మన దురదృష్టం కాక మరేమిటి?

ఇటువంటి భావాలే మన మనస్సుల్ని ఇంకా పాలిస్తూవుంటే, మనం నాటి సర్వంలో వుండటమే మంచిదని అర్థం వీర్పడుతున్నది. కాని ఒక విషయం మనం జ్ఞాపకం వుంచుకోవాలి. కొన్ని శతాబ్దాలుగా మనం బానిసత్వంలో మునిగి పోయివున్నాము. అప్పుడు గాలిపెల్చుకొనే విసులుబాటు గూడా మనకు లేకపోయింది. స్వాతంత్ర్యం అంటూ రావడంతో ఒకకొత్త విధమైన చైతన్యం మన జీవిత ప్రాంగణంలో అవతరించింది. వసివాడుపల్లాగా వున్న మన ఈ శరీరంలోని నరనాడుల్లోను ఆ చైతన్యం ఇప్పడు స్పందిస్తున్నది. ఇప్పుడు మనం కొంచెం జాగ్రత్తగా, నెమ్మదిగా నడవాలి. పరాగత్తాలన్న భావాన్ని దూరం చేసుకోవాలి, పరుగెత్తితే పడిపోవడం తప్పదు.

దేశం అనేక బాధలకు లోనైవుంది. అవి మాకు తెలియవని, మేము కళ్లు మూసుకు నడుస్తున్నామని మీరు అనుకుంటున్నట్లయితే పొరపడిన వాళ్లవుతున్నారు. అట్లా మేము అజ్ఞానం చేత ఆచరించబడివున్నట్లయితే, చర్చిల్ అన్నట్లు; గరిని పోచలం అయి వుండే వాళ్లం. కాక ఇప్పుడు చర్చిల్ మహాశయునికే కళ్లు తెలివిడిరి పడ్డాయి. దుఃఖమనేది, బాధఅనేది ఈ ప్రపంచాన్నంతా ఆవరించివుంది. ఈ విషయాన్ని మీరు విస్మరించ కూడదు.

మనకు ఇంకా సరిగ్గా ఆర్థిక స్వాతంత్ర్యం ఏర్పడలేదు. అందువల్ల మనం ఈ అగాధంలోంచి బయటపడ లేకుండా వున్నాము. అది మన ఒకళ్ల చేతుల్లో వుంటే బాగానే వుండేది. అట్లా లేదు కాబట్టే ఇన్ని తిప్పలూ పడవలసి వస్తున్నది. అందు వల్ల దీనిలోంచి బయటపడటం, అల్లాటప్పా వ్యవహారం కాదు.

మన రూపాయి వుంది. దాని మారకపు రేటును తగ్గించాలి, దానితో అనేక కష్టాలు మన నెత్తిన పడ్డాయి. ఈ కష్టాలన్నీ ఒక కర్షకునికి, ఒక కార్మికునికి అర్థం కమ్మంటే ఎట్లాఅవుతాయి, వారిని కొంతమంది తప్పు దారుల్లో గూడా పెడుతున్నారు. ఆ పాపాన్నంతా మా నెత్తిన రుద్దుతున్నారు.

అయినా మనం నిస్పృహ చెందవలసిన అవసరం లేదు. హృదయ దౌర్బల్యాన్ని పొందవలసిన పని అంతకన్నా లేదు. వ్యవహారాత్మకమైన బుద్ధితో మనం ఈసమస్యలను పరిష్కరించడానికి పూనుకోవాలి. సరియైన మనస్సుతో ఇందుకు ఉపక్రమించాలి.

ఎంతలో కొంతమంది వేస్తారు, కొన్ని మాటలు అంటారు. మనకు స్వాతంత్ర్యం వచ్చింది. పార్లమెంటు అంటూ ఒకటి ఏర్పడింది. అందులో ప్రతిపక్షం అంటూ లేనేలేదు అని అంటారు.

ఇవ్వాళ్ళ మనపార్లమెంటు ఎట్లా వుంది? దానికి ఇంకా చిన్నతనం వదలలేదు. ఇందులో మనం ఇతరదేశాలను అనుసరించవలసిన ఆగత్యం నాకేమీ కనపడటంలేదు. మనకాలానికి, మనకష్టాలకు, మన సుఖాలకు సరితూగిన వ్యవస్థలనుమనం నిర్మించుకోవాలి. మహాత్మగాంధీ ఈ పార్లమెంటులను గురించి చాలా వ్రాసారు. ఆవ్రాతలు అన్నీ ఏకరువుపెట్టి మిమ్మల్ని నేను విసిగించదలచుకోలేదు. మీకు నేను ఒక్కటే విజ్ఞప్తి చేయదలచుకొన్నాను. దేశాన్ని బలపడనీయండి, కొత్త రక్తం మనశరీర నాళాల్లోకి ఎక్కనీయండి. మనలో చైతన్యం స్పందించనీయండి. అందాకా ఒకరి కాళ్ళకు ఒకళ్లు అడ్డుతగలటం భావ్యంకాదు.

మనం ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవాలి. అందుకు గూడా అమేయమైన త్యాగాలు అవసరం. కొత్తవిధమైన నిర్మాణ పద్ధతులను మనం అనుసరించాలి. ఇందులో మనకు రైతుసహాయం పడాలి. కార్మికుడు చేయూతనివ్వాలి. ధనవంతులు ప్రోత్సాహం వుండాలి, మధ్యతరగతి ప్రజలు అండవుండాలి.

సిరంతా ఇప్పుడు కష్టాల్లో వున్నారు. రైతుకువున్న సమస్యలు రైతుకువున్నాయి. కార్మికులకువున్న కష్టాలు కార్మికులకు వున్నాయి. మధ్యతరగతి ప్రజల ఇబ్బందులు మధ్యతరగతి ప్రజలకు వున్నాయి. ధనవంతులంటారా వారికిగూడా కష్టనిష్టూరాలు వుంటే వుండవచ్చు.

మన దేశంలో వున్న ధనికుల సంపదని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. వారిని నచ్చకపడితే లాభంలేదు. అట్లా చేస్తే లాభం ఏమన్నా వుంటే వారిని రద్దు పెట్ట కలసిందగా కోరేవాళ్లతో నేనుకూడా చేరివుండేవాణ్ణి.

అనుభవశాలుల విద్యులు మన దేశంలో చాలా తక్కువమంది వున్నారు. వీళ్ల సాముద్రాలు కూడా అంతంతమాత్రంగానే వున్నాయి. అందువల్ల వట్టి సిద్ధాంతాలు వల్లించితే ఏమీ లాభంలేదు. మనం వాస్తవాన్ని సత్తించి పనికి ఉపక్రమించాలి. ఇంతలోమార్గాన్ని అనుసరించిదేశాన్ని ముక్కముక్కలుచేసి వేస్తాముంటున్నవాళ్లు వట్టి కబుర్లు చెబుతున్నారుగా. క్రియారూపంలో చేసింది ఒక్క సిరంపైనా కనపడటం లేదు.

మాకున్న ఈ కష్టాలన్నీ ధనవంతులను పీడించడంలో తీరిపోయేవి అయితే అట్లా చెయ్యడానికి నేను ఎంతమాత్రం సంకోచించేవాణ్ణి కాదు. అసలు విషయం ఏమిటంటే మనకస్తాలనుంచి గట్టెక్కడానికి అందర్నీ మనం వాడుకోవాలి. ప్రతివాడు మనల్ని అనుసరించేటట్లు చూడాలి. ప్రతివాడు త్యాగం చేసేటట్లు మనం చెయ్యాలి.

శరణార్థులవంకచూడండి. రైతుకు, కూలీకి వున్న కష్టాలకన్నా అతనికేమైనా తక్కువ కష్టాలు వున్నాయా? వారు తమ సర్వస్వాన్ని కోల్పోయారు. కాని నమ్మకాన్ని, ధైర్యాన్నీ మాత్రం కోల్పోలేదు. ఆ రెండింటిని కోల్పోకపోతే, మనుష్యుడు ఎప్పుడూ బాగుపడతాడు. అవి లుప్తమైపోతాయో, సర్వనాశనమే.

ప్రతి మనిషిని కలుసుకునే ఓపికగాని, దేశాన్ని పర్యటించివచ్చే శక్తిగాని నాకు ఇప్పుడులేదు. నేను అందుబాటులోలేని వాణ్ణని కొంతమంది అంటున్నారు. ఒకొక్క రోజున పందలమందిని చూచి మాట్లాడిన రోజులు నా జీవితంలో చాలా వున్నాయి. ఇప్పుడో, నా శక్తిపోయింది. సమయంగూడా కనుపించడంలేదు. అందువల్ల యెవ్వరూ నేను వారిని కలుసుకొని మాట్లాడలేకపోతున్నానని అన్యథా భావించడం తగదు.

నేను గోప్యంలో జీవితాన్ని గడిపే మనిషినిగాను. నాలో ఎంతశక్తివుంటే అదంతా మీ వినియోగంకోసమే వుంది. నేను యెక్కడవున్నా, ఏమిచేసినా, అది మీ కోసమేనని, దేశంకోసమేనని భావించండి. నేను ఏ కొంచెం మాట్లాడినా, దాన్ని సరిగ్గా అర్థంచేసుకొని, అట్లా నడవడానికి ప్రయత్నించండి. ఇదే మీకు నా విజ్ఞప్తి.

మనం త్యాగం చెయ్యాలి. లేకపోతే అభివృద్ధి వుండదు. అని నేను మీకు ఖచ్చితంగా చెబుతున్నాను. అభివృద్ధికోసం మనమంతా కలిసి పనిచెయ్యాలి. లేకపోతే పునర్నిర్మాణం సాధ్యపడదు. ఏదో కొందరిని శిక్షిస్తే మనం గట్టెక్కగలమంటారా, అట్లా చేసేద్దాం. కాని దేశంలో అనంత ప్రజానీకానికి అఖండమైన సౌఖ్యం చేకూరాలన్న దాన్ని మనం విస్మరించరాదు. అందుకోసం మనమంతా కృషి చెయ్యాలి. ఎవరివో తలలు ఎరువుతెచ్చుకొని, ఇక్కడ వాటితో పనిచేస్తామంటే లాభంలేదు.

అందువల్ల ధనికులుగూడా మనతో కలిసివస్తానంటే వారిని కాదనటం మన పనికాదు. అంతే కాకుండా, మనం దేన్ని సాధించామో, దాన్ని కష్టపడి సాధించి వుండకపోయినట్లయితే, దేశదేశాల్లో మనకీ ప్రతిష్ఠ, కీర్తివచ్చి వుండేదికాదు. మన కడుపులో బ్రహ్మాండమైన కుళ్లును పెంచుకొని, చక్కని దుస్తులతో దాన్ని అచ్ఛాదించినంతమాత్రం చేత ఒరిగేది ఏమీలేదు. అందువల్ల కలిగే ప్రయోజనంగూడాఏమీ లేదు. అందువల్ల మనం నాశనంకాకుండా బ్రతికివుండాలంటే, ఎక్కువగా ఉత్పత్తి చెయ్యాలి. ఈ అధికోత్పాదన విషయములోగూడా ఒక విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి. బొట్టుబొట్టు చొప్పున చేర్చగా, చేర్చగా సముద్రమువుతున్నది.

మన దేశంలో ఇప్పుడు ఉత్పత్తి స్తంభించిపోయింది, మనము ధనాన్ని ఏవిధంగానూ పండించలేకుండా వున్నాము. బ్రిటిష వాళ్ళు మననెత్తిన కూర్చున్న రోజుల్లో మనం ఏదోకొంత పండిస్తూ వుండేవాళ్లం. అందువల్ల వాళ్ళుపోతూ, పోతూ మాకు కొంచెం పంచి పెట్టండి, అని నోరు తెరచి అడిగినప్పుడు సరేనని వారి భాగం వారికి ఇచ్చి పంపించాం. ఇప్పుడు మన మనుష్యులంవచ్చి మన వ్యవహారాలు సరిదిద్దడం ప్రారంభించేసరికి, ఎక్కడలేని ఆవేశంతోను గోలలు ప్రారంభిస్తున్నాము. ధనవంతులు, మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు మనతో వుండవలసినవాళ్ళేగాని, ఎక్కడికో పొమ్మంటే పోయేవాళ్లుకాదు. వారితో మనకు అవసరంలేదు. వారు లేకుండానే వ్యవహారం సాగిపోతుంది అంటే, అట్లానే చెయ్యవచ్చును. కాని వారితో అవసరంవున్నదని మనం తెలుసుకున్నంతకాలం వారిని సరిగ్గా చూడవలసిన బాధ్యతకూడా మనమీద వుంది.

ప్రతి వ్యక్తి తన బాధ్యతలను నిర్వహించేటట్లు మనం చూడాలి. ప్రతివ్యక్తితోను మనం సరిగ్గా వ్యవహరించగల్గివుండాలి. ఇప్పుడు దేశంలో అన్న వస్త్రాల ధరలు తగ్గించారు. అందుకు నేను అనుసరించిన మార్గం ఇదే, ఒక్కొక్కప్పుడు కొందరిని మనం శిక్షించవలసివస్తుంది. అప్పుడుగూడా ఆ కొంతమందిచేసిన తప్పు బుజువు అయితేగాని శిక్షించేందుకు వీలులేదు.

అసలు ఈ అన్ని విషయాలకూ నామార్గాలు పూర్తిగా వేరు. ప్రేమచేత వారిని మనం జయించాలి. వారి హృదయాలు కరిగేట్లు చూడాలి. ఈవిధంగా గనుక మన ధాన్యాన్ని మనం పండించగల్గితే, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందామన్నమాటే.

ఈ దాహరణకు పంచదారను తీసుకుందాం, ఇప్పుడు దేశంలో కరువు ఏర్పడింది. ఇందువల్ల ప్రతివాడూ ఇబ్బంది పడుతున్నాడు. ఇప్పుడు పంచదార కరువువచ్చింది కాబట్టి, ఇది మనకు ఎట్లా లభ్యమవుతుంది అని ప్రతివాడూ ఆలోచించాలి. అట్లాగే ఆలోచించి, కొంతమంది ఇతర దేశాలనుంచి తెప్పించుకుందామంటున్నారు. కాని మనం అట్లా తెప్పించుకోలేమన్న సంగతి వీరికి తెలియదు, అందుకు కొంతకాలం పడుతుంది. అవసరమైన డబ్బు చూచుకోవలసి వుంటుంది.

తెల్ల పంచదార మనంతమాత్రం చేత మనం చచ్చిపోవడంలేదు. అది లేనందువల్ల కొంత చికాకు పడితే పడవచ్చును. అయినా చచ్చి మాత్రం పోవడంలేదు అందువల్ల కొంత కాలంపాటు అపంచదారలేకుండా, లేకుండా అంటే అసలు లేకుండాకాదు, వుండగలిగినవున్నప్పుడు, దానికోసం గందరగోళమెందుకో అర్థం కావడంలేదు.

మేము తప్పులు చేయలేదని నేను అనడంలేదు. ఇంతకంటే బాగాచేయగలం అని చెప్పి ముందుకు వచ్చేవాళ్ళువుంటే, ముందుకురావచ్చు, దేశాన్ని పాలించవచ్చు, వారిని అప్పుడు నేనుఅభినందిస్తాను. అట్లాకాదంటారా, అంతా కలిసి కూర్చుందాం, సమస్యలను గూర్చి ఆలోచిద్దాం, సహకార బుద్ధితో వాటిని పరిష్కరిద్దాం.

దేశములో ధాన్యాలు పుష్కలంగా పండే ప్రాంతాలను కొన్నింటిని మనం వదులుకోవలసి వచ్చింది. ఈ విషయాన్ని ఎవరూ విస్మరించరాదు. అయినా మన దేశంలో పుష్కలంగా ఆహారధాన్యాలను పండించే సావకాశం వుంది. కాని అందుకు మనం బాగా కష్టపడాలి. నిర్విరామంగా కృషి చేయాలి.

పరిస్థితి అంతా ఇట్లా వుంటే, కొంతమంది పంటలు పండించమని మొరాయిస్తున్నారు. మరి కొంతమంది ముందు ఎప్పుడో క్షామం వస్తుంది కాబట్టి, అప్పుడు నిల్వవున్న ధాన్యాన్ని ఎక్కువ ధరలకు అమ్ముకోవచ్చునని రెండు మూడు సంవత్సరాల పంటలను బయటపెట్టకుండా దాచినవాళ్లుగూడా వున్నారు, వీరంతా దేశానికి ద్రోహం చేస్తున్నారు.

ఎక్కువగా పండించడం, పొదుపుగా వాడుకోవడం, దుబారా లేకుండా చూడటం ఇది మనకు ధర్మం కావాలి. మన ఇంటిప్రక్కవాడు అన్నం లేక మాడిపోతూవుంటే, మనం తినగా మిగిలినదాన్ని అతనికి పెట్టడం అనేది సర్వమానవులకు ధర్మం అయిన విషయం. ఇటువంటి ధార్మికభావం మనలో పాదుకొనే దాకా మనం బలపడగలమన్నది అబద్ధం.

ఇప్పుడు మీ ముందు ఏ ధర్మసూత్రాన్ని వుంచానో, అది అనాది సిద్ధంగా మన దేశంలో వున్నటువంటిదేగాని యెక్కడనుంచో వచ్చిందికాదు. ఈ ధర్మసూత్రాన్ని మన దేశమే పాలించలేకపోతే, ప్రపంచంలో ఇంకా ఏ దేశమూ దీన్ని అనుసరించలేదు.

ఈ స్థితిలో రైతుకు రైతు, కూలీకి కూలీ, ధనవంతుడికి ధనవంతుడు నాభాగం నాకు కావాలంటే నాభాగంనాకు కావాలని మంకుపట్టుపడితే, మనకు ఆర్థికంగా స్వాతంత్ర్యం ఎప్పుడూరాదు. అందువల్ల మనమంతాకలిసి కష్టపడిపనిచెయ్యాలి. ఆర్థికస్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. అందులోనూ, ఒక్క సంవత్సరంలో దాన్ని మనం సాధించాలి.

ప్రస్తుతం దేశాన్ని ఎదుర్కొంటున్న ఈ సమస్యను ఇంకొకవిధంగా గూడా పరిశీలిద్దాం. మన దేశాన్ని మనం రక్షించుకోవాలి. మన సరిహద్దుల్ని మనం కాపాడుకోవాలి. ఇండియా విభక్తం కాకముందు దేశరక్షణకని 1100 కోట్ల రూపాయలు కనీసం ఖర్చు అవుతూవుండేది. దేశవిభజన పూర్తిఅయిన తరువాత మొత్తంఆదాయంలో సగం అందుకోసమే ఖర్చవుతోంది మనసైన్యంలో 4, 5 లక్షలమంది పనిచేస్తున్నారు. పాకిస్థాన్ సైన్యం అంతా కలిసి 2½ లక్షలులేదు. దేశంసుభిక్షంగా, శాంతింగావుండాలంటే ముందు దేశాన్ని రక్షించుకోవాలి. సరిహద్దుల్ని రక్షించుకోవాలి.

మీరు నా మాటవిని అట్లా నడుచుకుంటామంటే ఇంకా కొంత కాలం బ్రతికి మీకు సేవ చేయాలన్న ఉత్సాహం నన్ను నిల్పుతుంది. లేకా నేను బ్రతికి వుండి గూడా నిరర్థకం అవుతుంది. ఆ తరువాత మీరు "పూర్వం ఇక్కడా ఒక వ్యక్తి వుండేవాడు. ఆయన ఏ విషయాన్నైనా నా ఉంచి బ్రద్దలు కొట్టినట్లు చెప్పేవాడు. ఆయన చెప్పిన మాటల్లో అనుచితార్థం ఏమీ లేదు. అంతా మన బాగుకే చెప్పాడు. అని మీరు అనుకుంటారు

### నాయకుల ప్రశంసలు

ఈ సభలో నాలాడా 15 వాబు, శ్రీ ఎస్. పి. గాంధీ, శ్రేష్ఠి నాయకులు సర్దార్ పటేల్‌ను, ఆయన దేశానికి చేసిన సేవను ప్రశంసిస్తూ ఉపన్యాసాలు ఇచ్చారు.

[illegible]

విరోధి సం॥ కార్తీక శు॥ ద్వాదశి
1949 సం॥ నవం॥ 2 బుధవారం
బు॥ద్వాదశి స్థి॥ 5-49 ఉ.భా 24-0వర్జ్యం ప 2 47 ల॥4 36 వు.

శు॥ త్రయో॥ నవం॥ 3 గురువారం
సు॥ త్రయోదశి రా 9-30 ఉ.భా ఉ 7-3 వర్జ్యం రా॥ 8-37 ల 10-25వు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక శు॥ ద్వాదశి
బుధవారం

## సర్దార్ పటేల్ సందేశం

అఖండ భారత నిర్మాత, స్థిత ప్రజ్ఞుడు, విజయుడు, సర్దార్ వల్లభాయ్ పటేల్ 74 వ జన్మదినోత్సవము దేశమంతట వైభవోపేతముగ, అమితోత్సాహముతో జరుగుట వారి ప్రతిభా విశేషములకు సాక్షిగాక, వారినాయకత్వమునందు భారత ప్రజానీకమునకు గల అచంచల విశ్వాసమునకు, అపారభక్తి గౌరవములకు నిదర్శనము. అని చెప్పవచ్చును. స్వాతంత్ర్య సమర నిర్వహణ కాలమున మహాత్ముడు భారత ప్రజాశక్తిని ఎట్లు సంఘటితపరచి, భారతీయుల నందరిని ఎట్లు కార్యోన్ముఖుల చేసెనో, భారతదేశము స్వాతంత్ర్యమును పొందిన అనంతరము సర్దార్ పటేల్ భారతప్రజల స్మథర్మనిరతులచేసి స్వాతంత్ర్యమును స్థిరపరచి అఖండ భారత దేశమునకు రూపురేఖలు దిద్దెను. మరొకరికి సాధ్యపడని మహాకార్యమును రెండు సంవత్సరములలో అఖిల ప్రపంచమునకు ఆదర్శప్రాయమైన రీతిని సాధించెను. మహాత్ముడు పారతంత్ర్యమునుండి ప్రజలవిముక్తి చేసెను. సర్దార్ పటేల్ స్వతంత్ర ప్రజల సంఘటితపరచి సాంఘిక పారతంత్ర్యమునుండి విముక్తి చేసెను.

శాంతిభద్రతల సంరక్షణ ఎంత అసాధ్యమైనదో పంజాబు, బెంగాల్ దురంతములు దిఙ్మాత్రముగనైనను సూచింపకలిగినవి. 1947 ఆగస్టు 15 కు పూర్వము బ్రిటిష్ ప్రభుత్వము తన అపారసైనిక బలమును, రక్షకభట దళములను ప్రయోగించికూడ దేశవ్యాప్త సంక్షోభమును నివారింపలేకపోయెను. సర్దార్ పటేల్ బ్రిటన్ ధ్వంసం చేసిపోయిన సైనిక బలముతో ఇంతవరకు దేశశాంతిని కాపాడకలిగెను. యావత్తు ప్రపంచమునకు దిగ్భ్రమ కలుగునట్లు హైదరాబాదుసమస్యను పరిష్కరించెను. ఆయన తన ప్రసంగముల వలనగాక, తను సాధించిన మహాకార్యములవలన భారత ప్రజాహృదయమును ఆకర్షించెను. ఎట్టి క్లిష్టసమస్యలనైనను ఎదుర్కొనుటకు తగిన ధైర్యము నొసగెను. కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారు ప్రకటించినట్లు "పంచపాండవు లందరిలోని ప్రతిభావిశేషములు సర్దార్ పటేల్ నందు మూర్తీభవించి యున్నది."

మొన్న సోమవారము న్యూఢిల్లీలో తనను అభినందించుటకు జరిగిన మహాసభలో సర్దార్ పటేల్ చేసిన గభీరప్రసంగము వారి యాందోళనను గాక, మన కర్తవ్యమునుకూడ నన్నస్తము చేయుచున్నది. దేశము రాజకీయ సంక్షోభమునుండి గట్టెక్కెను. కాని ఆర్థిక సంక్షోభము దేశరాజకీయ స్వాతంత్ర్యమునకే ముప్పు తేగల స్థితికి వచ్చెను. సర్దార్ పటేల్ మొన్న సోమవారము చేసిన దీర్ఘ ప్రసంగమున ఈ విషయమునే వివరముగ చర్చించి యుండెను. స్వాతంత్ర్య సంపాదనకు త్యాగము చేసినట్లే స్వాతంత్ర్యమును స్థిరపరచుకొని ఆర్థిక స్వాతంత్ర్యమును సంపాదించుటకును విశేష త్యాగములు చేయవలసియుండు నని హెచ్చరించిరి.

వీటన్నింటికంటె కూడ సర్దార్ ప్రసంగమునందు గమనింపవలసిన విషయమొక్కటి గలదు. "మన నాయకుడు (పండిట్ నెహ్రూ) విదేశము లందు మన పేరుప్రతిష్ఠల నధికముచేసి, ఉన్నతస్థానమును సంపాదించుటకు అహర్నిశలు పాటుపడుచుండెను. జీవితాంతమువరకు ఆయనకు బలముచేకూర్చుటకే నేను సదా ప్రయత్నము చేయుచుందును. "భారతీయులందరు నేడు చేయవలసిన పని ఇదియే. మన నాయకత్వమును బలిష్ఠము చేసినగాని మన ప్రభుత్వమునకు స్థిరత్వ మేర్పడదు. ప్రభుత్వము స్థిరముగ నున్నగాని దేశసమస్యల పరిష్కారము సాధ్యముగాదు. సర్దార్ పటేల్ హెచ్చరించినట్లు నేడు దేశమును ఎదుర్కొనుచున్న ఆర్థికసమస్యలు పూర్తిగ పరిష్కారము కావలె నన్న ప్రతి ఒక్కరు రైతులు, కూలీలు, పారిశ్రామికులు తమ యావచ్ఛక్తిని వినియోగించి వస్తూత్పత్తిని వృద్ధి చేయవలసి యున్నది. సాధ్యమైనంతవరకు అవసరములను తగ్గించుకొని, దేశమున "యథార్థసంపదను" వృద్ధిచేసినగాని ఆర్థికసమస్యల పరిష్కారము సాధ్యముగాదు. భారత పౌరులు ప్రతి ఒక్కరు సర్దార్ పటేల్ సందేశము నాలించి కార్యోన్ముఖులగుదురుగాక!

## అగ్రరాజ్య విభేదాలు: భారతదేశతాటస్థ్యం

### జర్మన్ పత్రికలో విజయలక్ష్మి వ్యాసం

స్టుట్ గార్ట్, (ప. జర్మనీ) అక్టోబరు 31: అగ్రరాజ్యాల మధ్య ఏర్పడే వివాదాలన్నిటికీ దూరంగా ఉండాలని ఇండియా అభిలషిస్తున్నట్లు వాషింగ్టన్‌లో భారతరాయబారి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ నేడు స్టుట్ గార్టర్ జైటుంగ్ అనే పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ ప్రకటించింది.

"ప్రపంచంలోని 2 ప్రధాన వర్గాల మధ్య ఉన్న సహకారం భగ్నమైతే ఇండియా చాల నష్టకష్టాలకు లోనవుతుంది కనుక ఉభయపక్షాల మధ్య ఉద్రేకవాతావరణం ఏర్పడితే వారిని సమాధానపరచటానికే ఈదేశం ముఖ్యంగా ప్రయత్నిస్తుంది. ఇండియా తానొక నాయకదేశంగా చెప్పకోదు కాని ఆసియాఖండంలో ముందడుగు వేసి మిగిలిన దేశాలకు దారి చూపించగల నని మాత్రం భావిస్తున్నది. భారతవిదేశాంగ విధానంలో లాభసంపాదనమీద ఆశ అన్నది కనిపించదు. అయితే మా ప్రజల జీవిత పరిస్థితులను అభివృద్ధిచేసుకొనటానికి పశ్చిమ రాజ్యాల సహాయం అవసరం కనుక ఇంకా బ్రిటిష్ కామన్వెల్తులో ఉన్నది. అని ఆమె వ్రాసినది.

## వరదబాధితుల సహాయార్థం నాటక ప్రదర్శనం

నర్సారావుపేట, అక్టోబరు 28:— ఒంగోలు, బాపట్ల తాలూకాలలో యిటీవల వరదలవలన బాధపడినవారి సహాయార్థం 25 వ తేదీన బెజవాడ రాజరాజేశ్వరీ నాట్యమండలి వారిచే చారిత్రాత్మక నాటక ప్రదర్శనం జరుపబడెను. నాటక ప్రదర్శనంవల్ల ఉదారులు యిచ్చిన విరాళములవల్ల మొత్తం 52 వేల రూపాయలు వసూలైనవి. వరదబాధితుల సహాయనిధి సంఘ అధ్యక్షులు కాసు బ్రహ్మానందరెడ్డి ఎం. ఎల్. ఏ. గారు పైనిధికి సహాయపడిన వారిలందరకు నాటకప్రదర్శనమునకు ముందు కం॥ నమస్కరించారు. జిల్లా కలెక్టరు టి. ప్రభాకరరావు నాయుడు గారు కూడ నాటక ప్రదర్శనమునకు హాజరైనారు. (స్వ. వి.)

## 'ఆసియా నవయుగోదయం ప్రపంచ చరిత్రలో ఒక మహోజ్వల ఘట్టం'

### కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ప్రధాని నెహ్రూ ప్రసంగం

శాన్‌ఫ్రాన్‌సిస్కో, అక్టోబరు 31: 'ఆసియా నవయుగోదయం ప్రపంచచరిత్రలో ఒక మహోజ్వలఘట్టం. ఇది యావత్ప్రపంచానికీ వెలుగుబాట. నేటి నవయుగచరిత్రను ఉల్లేఖించవలసి వచ్చినపుడు, చరిత్రకారులు, అంతర్జాతీయరాజకీయరంగంలో ఆసియా పునఃప్రవేశాన్ని ప్రప్రధాన సంఘటనగా చిత్రించుకోవలసివుంటుంది. ప్రపంచ రాజ్యాలన్నీ ఈ ఆసియా నవోదయరేఖలను ఔత్సుక్యంతో తిలకించుతూన్నయ్. తాను ప్రపంచ రాజకీయరంగంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించి వున్న కారణంగానూ, ఇతర నైసర్గికాది కారణాలవల్లనూ అమెరికా మరింత ఔత్సుక్యాన్ని చూపుతున్నది;' అని ఈవేళ ప్రధాని నెహ్రూ శాన్‌ఫ్రాన్‌సిస్కోలోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ప్రసంగించారు. ఇది ప్రధాని నెహ్రూ అమెరికాలో చేసిన ప్రధాన ప్రసంగాలు మూడింటిలోనూ కట్టకడపటిది.

ఈ సమావేశానికి అనేకమంది విద్యార్థులూ, గ్రీక్ థియేటర్ తాలూకు బహిరంగ నాటకరంగం శాఖకు చెందినవాళ్లున్నూ కేంద్రంలోనివారూ హాజరైనారు.

భారత స్వాతంత్ర్యం ఒక చరిత్రాత్మక సన్నివేశం. ఇంకా ఆసియారాజ్యాలు కొన్ని వలస ప్రభుత్వాల బానిసత్వాన్ని అనుభవించుతూ వున్నవి. వాటన్నిటికీ కూడా వెంటనేవిముక్తిలభించవలసివున్నది. ఇది కేవలం ఆసియాప్రజల అభివృద్ధికే కాక ప్రపంచశాంతికీ స్థాయీభావమునకూ తప్పనిసరి అవసరము. అట్లు జరగవలెనంటే ఆయా దేశాలలో సెల్ల పారిశ్రామికాభివృద్ధి యెంతేని కావలసివున్నది. ఈ మహాకార్యమునందు అమెరికా ప్రధానమైన పాత్ర వహించుటకు మంచి సావకాశమున్నది.

ఇదిగాక, జాతి వివక్షత ఒక ప్రమాదకరమైన విషయము. గత చరిత్రయొక్క శిథిలచిహ్నముగా మిగిలియున్న ఈ దుర్భావనను వెంటనే నిర్మూలింపవలసియున్నది.

'మహాత్ముడు ఉపదేశించిన మహాదర్శములనూ, ప్రాపంచిక దృక్పథమునూ ఆధారము చేసుకొని, ఇప్పుడు భారత దేశములోని ప్రభుత్వము సాగుతున్నది.

'స్వాతంత్ర్య, శాంతి, సహకారములూ, ప్రపంచాభివృద్ధికి అంతరాయము కాని జాతీయాభివృద్ధి, సర్వమానవ సమానత్వమూ, ప్రపంచ ప్రజల రుజాదారిద్ర్య విముక్తి స్థాయివి, భారతదేశపు ఆశయాలు.

'ఆర్థిక స్వాతంత్ర్యము లేని రాజకీయ స్వాతంత్ర్యానికి అర్థం లేదు. ప్రజలను అభివృద్ధికి తెచ్చుకోలేని మన రాజకీయాలూ, మన వాదోపవాదాలూ, వట్టి అర్థంలేని ఊకదంపు.

'దుష్టమైన సాధనా విధానాలను అవలంబించి, ప్రపంచంలో యేమహా ప్రయోజనాన్ని మనం సాధించలేం. ప్రపంచంలో సర్వత్రా ఇప్పుడు భయవిద్వేషాలు పరివ్యాప్తమై వున్నయ్. ఇవి నిర్మూలం కావాలి. పరస్పర విరుద్ధ భావాల కల్లోలంలోనూ, నిరంతర ప్రమాద పరిస్థితులలోనూ మనం బ్రతుకవలసివస్తున్నది. మనం శాంతికావాలని చెబుతూ యుద్ధానికిసిద్ధమవుతున్నాం. 'ఏక ప్రపంచం', 'అంతర్జాతీయత' ఈ రకంమాటలు మాట్లాడుతూ, సంకుచితమైన జాతీయతత్వంతో ప్రవర్తించుతూ వుంటాం.

'ఏమో ఆదర్శాల సంఘర్షణ వున్నదంటూవుంటారు. ఆ ఆదర్శాలేమిటో కూడా అర్థంచేసుకోకుండా, వాద ప్రతివాదాలతో సంఘర్షణలతో చిక్కుతూ వుంటాం. ఎప్పటికప్పుడు యేదుకైన తాత్కాలిక ప్రమాదాలలో పడుతూ, ఆసలు వాటన్నిటికీగల ప్రధాన కారణమేమిటో గుర్తించుకోలేని అయోమయస్థితిలో నడుస్తూవుంటాం.'

'ఏదో చరిత్ర నిర్మాతలమంటూ గర్వపడుతూ వుంటాం కాని ప్రపంచపరిస్థితులు యేఅడుగూ అర్థంలేకుండా మనకళ్ళముందు భీభత్సరూపంలో లేచినిల్చుంటై. ఏమీ చేయలేని అసమర్థతతో కంగారై వాటిముందు బానిసలుగా మోకరిలిపోతూ వుంటాం. భయభ్రాంతి మన్ని ఆవరించివేస్తుంది; దాని వెనువెంటనే విద్వేషం మననెత్తికెక్కుతుంది.

'మన స్వంత ఆదర్శాల సన్నిటినీ మన చూట్టూ అద్దాలమేడలుగా నిర్మించుకుని, వాటిలోకూర్చుని సంతోషించుతూ, చుట్టూవున్న వాస్తవిక పరిస్థితులను గమనించకుండా కళ్లుమూసుకున్నందువల్ల ప్రయోజనంలేదు. అందులో బాధ్యతలు కలవారు ఇలా ప్రవర్తించటానికి యేఅవసరమూలేదు. అయితే ఎప్పటికప్పుడు తాత్కాలిక స్థితిగతులనూ సన్నివేశాలనూ అవగతం చేసుకుని ప్రయోజనం లేదు. ప్రపంచ స్థితిగతులను మనచెప్పు చేతలలో నడిపించుకోవాలనే అభిలాష మనకువుంటే సునిశ్చితమైన ఆలోచనా దృష్టితో వాస్తవసత్యాన్ని అన్వేషించవలసివుంటుంది.' అన్నారు.

ఈ ప్రసంగాన్ని నెహ్రూముందుగా తయారుచేసి సభలో చదివివినిపించారు. దీనికి ప్రవేశికగా కొంచెంసేపు సద్యః ప్రసంగంగామాట్లాడారు. ఆసందర్భంలో:

'ఈ కేంద్రంయొక్క సుందరదృశ్యాన్ని, ఈ విద్యార్థుల సమావేశాన్నీ నేనుఎన్నటికీ మరచిపోను.

'నేను, ప్రధానుల మంత్రుల జాబితాలోగాని, రాజకీయాధికారుల జాబితాలోగాని, తేలికగా ఇమిడిపోగల తత్వంగలవాణ్ణికాదు. సభికులతో ప్రసంగించేటప్పుడు సన్నిహితుణ్ణయి, ముఖాముఖి సద్యః ప్రసంగం చేయటం నాకు బాగుంటుందిగాని ఏందో లాంచనప్రకారం ప్రసంగ పాఠాన్ని చేత్తో పుచ్చుకొని వప్పగింత చేసే పద్ధతి నాకంతగానచ్చదు. అయితే నేను అమెరికా వచ్చినతరువాత నన్ను సద్యః ప్రసంగాలు చేయవద్దని హెచ్చరించారు. మాటాడకూడని విషయాలు మాట్లాడతానేమోనని యీ హెచ్చరిక చేశారు.

'నేను అమెరికా వచ్చినతరువాత ఇక్కడ అధికారం వహించుతున్న అనేకమంది మహానాయకులనూ అధికారబాధ్యతలు నిర్వహించుతున్న స్త్రీ పురుషప్రముఖులనూ చూచాను. అయితే సామాన్య ప్రజాబాహుళ్యంతో సన్నిహితుణ్ణికాలేకపోయాను. ఆట పాట నిర్వహించుకుంటూన్న సామాన్య ప్రజలను చూడాలని నాకెంతో అభిలాషగా వున్నది. అయితే, నాకుగల కాలవ్యవధి చాలా పరిమితం కావటంచేత అలాంటి సత్సావకాశాన్ని కోల్పోవలసివస్తున్నది.

'నా ఆగమనాన్ని' అధ్యక్షులు ట్రూమన్ అన్వేషణయాత్ర అన్నారు. అమెరికాలో నేను తెలుసుకోవలసిన విషయాలు యెన్నోవున్నయ్. 4 వారాల ఈ అల్పావధిలో ఈ మహాదేశాన్ని గురించి, సమగ్రంగా తెలుసుకోవటం, యెవరికి మాత్రం యెలా సాధ్యం?

'భారతదేశాన్ని గురించి తెలుసుకోవటానికే నా జీవితమంతా ప్రయత్నించాను. కాని అన్వేషణ ఇంకా యెంతో అసమగ్రంగావున్నది. అన్వేషణ చేసినకొద్దీ, భారత జాతీయతకు సంబంధించినయెన్నో నూతనాతినూతనమైన విషయాలు బయటికి వస్తున్నయ్.

'నేనిక్కడ యీకొలది దినాలు పర్యటనలోనూ అమెరికాను ఇంత ఉత్కృష్టస్థితికి తెచ్చిన ప్రధాన తేజమేమో గ్రహించానని చెప్పవచ్చు. శాస్త్రవిజ్ఞాన శక్తులను మానవాభివృద్ధి కార్యక్రమంలో ప్రయోగించి అమెరికా సాధించిన ఈ పురోగమనాన్ని చూస్తే, యెవ్వరికైనా, కొంచెం ఈర్ష్య కలగటంకూడా సహజం. అమెరికా అనుసరించిన యీవిధానాన్ని, తక్కినవారంకూడా అర్థంచేసుకోవలసి వుంటుంది. అయితే నేనొకటి చెబుతాను—పునాదులు బలంగాలేని యే నిర్మాణాలుకూడా ఎంతోకాలం శాశ్వతంగా నిల్వలేవు.

'అమెరికాలోని సాధారణ పౌరుని గురించి, ప్రపంచంలోవుండే అభిప్రాయమేమంటే చాలా తెలివిగలవాడూ, బింకంగలవాడూ, పచ్చివాస్తవ దృక్పథంతో వర్తించే వ్యాపారస్థుడనీ, డబ్బు బాగా పోగుచేసుకుని, దాన్ని తన అధికారాన్నీ పలుకుబడినీ పెంపొందించుకుంటాడనీ— ఈరకంగా అనుకుంటారు. 'అమెరికా, భారతదేశాల చరిత్రాభివృద్ధులకు నైసర్గిక పరిస్థితులు ఎంతో దోహదంచేసినై. ఋషివ్యక్తులలోకూడా అలానే వుంటుంది. గత చరిత్రదృష్టిలోనూ, అనాది బాంధవ్యాల దృష్టిలోనూ అమెరికా యూరపునందు వాత్సల్యాన్ని కలిగివుండటం సహజం. యూరప్ ప్రపంచ రాజకీయాలలో ఎంతో కాలంగా ప్రధానరంగంగా వుంటూ వచ్చింది.

'అమెరికా మహోజ్వలమైన సాంకేతిక విద్యాశక్తులను సాధించింది. వాటి ప్రతిఫలం ప్రపంచానికంతకూ లభించాలి' అన్నారు.

## చికాగోవిశ్వవిద్యాలయ గోష్ఠిలో నెహ్రూ ఉపన్యాసం

చికాగో, అక్టోబరు 30: భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఈవేళ చికాగో విశ్వవిద్యాలయంవారు ఏర్పాటు చేసిన గోష్ఠిలో రేడియోప్రసంగం చేస్తూ, యుద్ధాలను నిర్మూలించడానికి ప్రపంచ ఫెడరేషన్ నిర్మాణం ఒక్కటే సాధనోపాయమని చెప్పెను.

చికాగో విశ్వవిద్యాలయంలో మానవజాతి శాస్త్ర అధ్యాపకుడుగా పనిచేస్తున్న రాబర్టు రెడ్ ఫీల్డ్ ఈ గోష్ఠిలో పాల్గొంటూ పండిట్ నెహ్రూను మార్షల్ పథకం గూర్చి మీ అభిప్రాయమేమని ప్రశ్నించెను. ఈ ప్రశ్నకు పండిట్ నెహ్రూ సమాధానమిస్తూ ఇట్లు చెప్పెను: "యూరప్‌లోని కొన్ని దేశాలు స్వయంపోషకం అవడానికి ఈ పథకం చాలా సహాయపడ్డదనడంలో సందేహంలేదు. వెనుకబడిన దేశాల అభివృద్ధికి అధ్యక్షుడు ట్రూమన్ వేసిన కార్యక్రమంకూడా సరియైన దృక్పథంతో వేసిందిగానే కనిపిస్తుంది."

ప్రపంచయుద్ధం లేదా ప్రపంచసఖ్యత ఇవిరెండే మనకున్న మార్గాంతరాలనీ, మానవజాతికి ఈ రెంటిలో ఏదో ఒకటి ప్రాప్తించడం అనివార్యమనీ, మీరు లోగడ అన్నమాటలను వివరించవలసిందని పండిట్ నెహ్రూను రెడ్‌ఫీల్డ్ ప్రశ్నించగా నెహ్రూఇట్లు జవాబు చెప్పెను: "ప్రపంచంలోని వివిధ భాగాల మధ్య సంపూర్ణ సహకారం ఏర్పడనంతవరకు సంఘర్షణావకాశం అంతో ఇంతో ఎప్పుడూ ఉండనే ఉంటుంది. కొబట్టి సహకారమా? సంఘర్షణా? ఈ రెంటిలో ఏది కావాలి? అన్నది మనం తేల్చుకోవాలి. ఇవిరెండూ తప్ప మనకు వేరే మధ్యమార్గం లేదు. అయితే సంపూర్ణ సహకారం ఒక్కసారిగా ఏర్పడడం కష్టం. అది క్రమంగా పెరగవలసి ఉంటుంది. ప్రపంచ సహకారాన్ని అనివార్యంచేసే పరిస్థితులు కొన్ని ఈనాడు ఏర్పడిఉన్నవి.

ఈ సహకారం ఏరూపం ధరిస్తుంది అన్నది. ఊహించడం కష్టం. ఈ పరస్పర సహకారం వివిధ దేశాల వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని భగ్నపరచేదిగా ఉండదన్నది మాత్రం విస్పష్టం. ఒక కేంద్ర సంస్థకు వివిధదేశాలు ఐచ్ఛికంగా తమ సార్వభౌమత్వంలోని కొన్ని అంశాలను అప్పగించవచ్చును. కాని అంతరంగికంగా ప్రతిదేశమూ తన ఇచ్ఛవచ్చిన విధానాన్ని అనుసరించడానికి, సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవించడానికి వీలు ఉంటుంది." అంటే, ఒకవిధమైన ప్రపంచ ఫెడరేషన్ ఏర్పడాలి అనేనా మీ తాత్పర్యం అని రెడ్ ఫీల్డు ప్రశ్నించెను. దానికి పండిట్ నెహ్రూ ఇలా బదులు చెప్పెను: ఆ; అలానే అనవచ్చును. నేను సూచించిన సహకార వ్యవస్థకు ఫెడరల్ వ్యవస్థ అని పేరు పెట్టదలిస్తే పెట్టవచ్చును; ఆదిలో ఈ ఫెడరల్ వ్యవస్థ చేతుల్లో ఉండే అధికారాలు బహు పరిమితమై ఉంటవి; పోను పోను ప్రజలు ఈ వ్యవస్థకు అలవాటుపడ్డకొద్దీ అధికారాలు పెరుగుతూ వస్తవి."

ఆసియారాజ్యాల సమాఖ్య విషయం ప్రశ్నించగా నెహ్రూ ఇట్లు ప్రత్యుత్తరం ఇచ్చెను:

"ఆసియాలో వివిధ దేశాలమధ్య సహకారం యూరోప్‌లో అంతగా వృద్ధి చెందలేదు. ఈ ఉద్దేశ్యం ఇంతవరకు ఆలోచనలోనే ఉన్నదిగాని ఆచరణలోకి ఇంకా దిగలేదు. అయితే ఆసియానంతను కలిపి ఒక సహకార కూటమిగా నిర్మించడం సాధ్యంకాక పోవచ్చును. ఎందుచేతనంటే ఇది చాలా బృహత్పరిణామంగల భూఖండం. దీనిని ఆగ్నేయ ఆసియా, పశ్చిమ ఆసియా, తూర్పు ఆసియా ప్రాంతాలుగా విభజించి విడివిడిగా ప్రాంతీయ సహకార కూటములు ఏర్పరచవలసి ఉంటుంది. తర్వాత, కావాలనుకుంటే యీ మూడు కూటములను ఒకదానికొకటి అనుబంధించుకోవచ్చును."

## బందర్లో బాధితులకు సహాయపు ఏర్పాట్లు

(1 వ పేజీ తరువాయి)

సహాయార్థం 2 వేల రూ॥ లు మంజూరు చేయబడినది అత్యవసరమైన మరమ్మతు పనులన్నీ చేయడానికి కార్యనగ్రానికి అధికారమివ్వబడినది. బందరులోని బాధితుల సహాయార్థం లక్ష రూ॥ లు మంజూరు చేయవలసిందిగా పురపాలక సంఘం ప్రభుత్వానునగించింది.

బాధితుల సహాయార్థం పని చేసిన వారందరిలో అగ్ని మాపకదళం వారిని ముఖ్యంగా అభినందించ వలసి వున్నది. 28వ తేదీ సాయంత్రం నుంచి ఇప్పటి వరకూ వారు తమ మనుష్యులను, లారీలు మొదలైన వాటిని పంపి బాధితులకు సహాయంచేశారు. తమ ఇంజన్లను పంపి, నీటి సరఫరా కార్యాలయం వారికి తోడ్పడ్డారు.

రిజర్వుపోలీసులు పోటకు వాసలలో ఎక్కడ రోడ్డురోడ్డుకూ తిరుగుతూ అడ్డంగా పడి వున్న చెట్లు మొదలైన వాటిని తొలగించారు.

నిన్న సాయంత్రం కలెక్టరుగారు పురమందిరంలో జరిగిన బహిరంగ సభకు అధ్యక్షత వహించి మాట్లాడుతూ ప్రభుత్వం చేసిన సహాయపు ఏర్పాట్లను వివరించారు. పట్టణ ప్రజలు, బయటివారు కూడా జిల్లాలోని తుపానుబాధితులందరికీ సహాయంచేయవలెనని విజ్ఞప్తి చేశారు. మునిసిపల్ చైర్మను నా॥ అచ్యుతరామయ్యగారు బందరులో పడిపోయిన ఇళ్ళు 7 వేలకు పైగా ఉంటాయని అంచనావేశారు. గుడిసెలు, పెంకుటిళ్ళు ధ్వంసమై 15 వేల మంది ప్రజలు నిరాశ్రయులయ్యారు. పురపాలక సంఘం తీర్మానం చేస్తూ గుడిసెలుకూలిన ప్రజలకు లక్ష 50 వేల రూ॥ మంజూరుచేయించవలెనని, మధ్యతరగతి ప్రజలు తిరిగి ఇస్లుకట్టుకొనుటకు వీలుగా వడ్డీలేని ఋణములనివ్వవలెనని ప్రభుత్వమును కోరింది. దెబ్బతిన్న ఇళ్ల మరమ్మతుకు అవసరమైన సిమెంటును సప్లయిచేయమని కోరుతూ మరొక తీర్మానంచేయబడింది.

నేటినుంచీ బందరులో సహాయ కార్యక్రమం అనధికారుల చేతి మీదుగా జరుగుతుంది. స్థానిక బియ్యపుమిల్లు యజమానుల సంఘంవారు అన్నం వండి దూర దూర గ్రామాలకుకూడా పంపిస్తున్నారు. ఈ ఏర్పాట్లన్నిటినీ సంఘాధ్యక్షులు పాలకుర్తి కోదండరామయ్యగారు, కార్యదర్శి ఎమ్. వి. రత్నంగారు చూస్తున్నారు. స్వ. వి.

## గుడివాడ తాలూకాలో విపరీత నష్టం

విజయవాడ, అక్టోబరు 31: ఈ దినము గుడివాడ నుండి ఆ పట్టణం మునిసిపల్ చైర్మను గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త కేతవరపు లక్ష్మీనరసింహారావు ప్రభృతులు ఇక్కడ వున్న కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకటరావు గారిని కలుసుకొని మాట్లాడుటకువచ్చిరి. కృష్ణాజిల్లా అంతటికీ గుడివాడ కైకలూరు తాలూకాలకే యెక్కువ నష్టమనీ, గుడివాడ యేలూరు రోడ్డు మీద జొన్నపాడు నుండి ఆరుగోలను వరకు ఉన్న గ్రామాలన్నీ బుడమేరు వరదతో నిండిపోయినవనీ వారు తెలిపారు.

గుడివాడలో తుపాను, వరదబాధలకు గురి అయిన కార్మికులు సుమారు రెండు వేలమందికి కాంగ్రెసుప్రముఖులు, బియ్యపు మిల్లు యజమానులు భోజనపు వసతులేర్పాటు చేశారట. గుడివాడ చుట్టుప్రక్క గ్రామాల్లోకూడా చాలా పశువులు చచ్చిపోయినవనీ, తాలూకా మొత్తం మీద 50 మంది తుపాను వల్ల చచ్చిపోయారని అంచనా వేస్తున్నారు. కొల్లేరు గ్రామాల నష్టము చెప్పనలవి కాదట. గుడివాడ కైకలూరు తాలూకాలలోనే నష్టము రెండుకోట్ల రూపాయ లుండునని అంచనా వేయుచున్నారు. తుపాను పోయి మూడవ రోజైనా వరి పైరు మూడవనుగుల నీటిలో మునిగి వున్నదట.

నూజివీడు రైల్వేస్టేషను దగ్గర వున్న యేలేరు గ్రామం, దాని చుట్టున్న గెండుమాల పల్లెలు అక్కడి చెరువు తెగి కొట్టుకొనిపోయినవని తెలుస్తున్నది. పశువులన్నీ చనిపోయినవట. తేలప్రోలు గ్రామంలో ఇండ్లుపడి 12 మంది చనిపోయినట్లు స్థానిక కాంగ్రెసు ఆఫీసుకు వార్త వచ్చినది.

గన్నవరం తాలూకాలోకూడా పంట నష్టం అపరిమితమనీ వరిపంటకు వచ్చిన నష్టం అపారమనీ నూటికి 15 వంతుల పంటకూడా వుండదని రైతులంటున్నారు.

## గుడివాడలో బాధితులకు సహాయ ఏర్పాట్లు

గుడివాడ, అక్టోబరు 31: తుపానువల్ల నిరాశ్రయులు, నిరాధారులు అయిన వందల కొలదీ ప్రజలకు స్థానిక ఆర్. డి. ఓ. రైసుమిల్లులలోను, సినిమా హాలులలోను, సత్రవులలోను, పాఠశాలలలోను ఆశ్రయం ఏర్పాటు చేశారు. తాలూకా సప్లయి ఆఫీసరు బాధితులకు అన్నదానంచేసేవారికి స్పెషల్ పర్మిట్లపై బియ్యం అందచేస్తున్నారు. మునిసిపల్ కమిషనరు, సిబ్బంది కౌన్సిలర్లు వార్డుల వారిగా నష్టం ఎంతకలిగిందీ అరా తీస్తున్నారు. ఎ వెంకటసుబ్రహ్మణ్యం, రామలింగేశ్వరా రైస్‌మిల్లు యజమానులూ, మార్వాడీలు బాధితులైన పేదలకు భోజనపుటేర్పాట్లు చేశారు. ఈ సందర్భంలో కొంతకాలం అల్లరి జరగకుండా పోలీసులు రాత్రింబవళ్లు గస్తీ తిరుగుతున్నారు. పీపుల్సు డిఫెన్సువారు బజార్లలో పోగుపడిన చెత్తను త్వరత్వరగా తీసివేస్తున్నారు. పోస్టల్ సూపరింటెండెంటు గారు 3 రోజుల టపాను విజయవాడనుంచి పామర్రుమీదుగా బస్సులో తెప్పించి, ఈ సాయంకాలం డెలివరీచేయించారు.

జిల్లాబోర్డు అధ్యక్షుడు కాకాని వెంకటరత్నంగారు, తూర్పు కృష్ణా కాంగ్రెస్ అధ్యక్షుడు మాగంటి అంకినీడుగారితో ఈ తాలూకాలో సంచరించారు. చాలాచోట్ల రైతులు తమ బాధలు తెలుపుకొంటూ వారికి విజ్ఞప్తులు సమర్పించారు. వారు త్వరలో సహాయం ఏర్పాటుచేస్తామని వాగ్దానాలుచేశారు. గుడివాడ, ముదినేపల్లిలలోని మిడిల్, హైస్కూళ్ళను తనిఖీ చేసి పదిరోజులవరకూ మూసి వేయవలసిందని సలహా ఇచ్చారు.

స్థానిక సబ్ కలెక్టరుగారు, తాలూకా సప్లయి ఆఫీసరుతో గుడ్లవల్లేరు, పామర్రు, ముదినేపల్లి ఫిర్కాలకు వెళ్ళి చూసి, ఫిర్కా సహాయ సంఘాలు ఏర్పాటుచేశారు. తాసిల్దారు ఓ. వి. సుబ్బారావుగారు. బుడమేరు ముంపుకులోనైన గ్రామాలకు, బొడ్డులోతు నీళ్ళల్లో నడిచి వెళ్ళారు. అక్కడ నిరాశ్రయులైనవారికి ఆహారపదార్థాలు చేరవేసేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు.

## గుడ్లవల్లేరులో 2 లక్షల నష్టం

గుడ్లవల్లేరులో నాలుగు రైసుమిల్లుల చిమ్నీలు పడిపోయాయి. పైకప్పులు దెబ్బతిన్నాయి. బియ్యం, ధాన్యం నిల్వలుపాడైపోయాయి. పుల్లేరు కాలవలో ఎన్నో బోట్లు మునిగిపోయాయి కలెక్టరు స్టాఫ్ బోటుమాత్రం స్థానిక రెవిన్యూ ఇన్‌స్పెక్టరు ఎట్లాగో మునిగిపోకుండా కాపాడగలిగాడు. రావుసాహెబ్ బాపయ్యచౌదరి, ఎ. సుబ్బారావు గార్లు బాధిత పేదలకు భోజనం ఏర్పాట్లుచేశారు. 2 వేల పశువులు చనిపోయినట్లు, 700 తాటాకు, పెంకుటిళ్ళు బాగా నష్టపడినట్లు, 6 గురు మనుష్యులుకూడా చనిపోయినట్లు తెలిసింది. మొత్తనష్టం. సుమారు 2 లక్షలుండుదం టున్నారు. రెవెన్యూశాఖవారు సరియైన లెక్కలు సేకరిస్తున్నారు. (స్వ. వి.)

## 100 చ. మైళ్లు నీట మునిగినవి

విజయవాడ, అక్టోబరు 31: బుడమేరు వరదలవల్ల చుట్టుపట్ల 40 గ్రామాలు, 100 చదరపుమైళ్లు 4 అడుగుల నీట మునిగినవి. లక్షలకొలది ఎకరాలపంటపోయినది. జిల్లా కలక్టరు పాణిగారు వరదలనష్టం కలిగిన ప్రాంతాలకుపోయి తగు యేర్పాటుకేలు చేయుచున్నారు.

బెజవాడలో ఎలక్ట్రిక్ కంపెనీవారు గొప్పవారికి సినిమాలకు ముందు విద్యుచ్ఛక్తినిచ్చి, ప్రజల కుపయోగపడే టెలిఫోనులకు, యితరులకు యివ్వడంలేదని, ప్రజలలో విమర్శ బయలుదేరింది. (స్వ. వి.)

## గవర్నర్ జనరల్‌కు గాడ్సే విజ్ఞప్తి

అంబాలా, నవంబరు 1: తన రాష్ట్రమునందలి ఒక చెరసాలకు మార్చి అచ్చట ఉరితీయవలెనని ప్రార్థించుచు మహాత్ముని హత్యకై ఉరితీయబడనున్న నాథురామ్ గాడ్సే గవర్నరు జనరలుకు దరఖాస్తు పెట్టెనని తెలియుచున్నది. తన జననీ జనకులు, బంధువులు తన్ను కలిసికొనకవీలగుటకు గాను ఆయన ఈ ప్రార్థన గావించెనని చెప్పుచున్నారు. తన ఉరికి నిర్ణయించిన తేదీకి పూర్వమే తన్ను ఉరితీయవలెనని గాడ్సే గవర్నరు జనరలుకు మనవిచేసెనని గూడా తెలియుచున్నది. తాను చంపిన వ్యక్తియెడల తాను కనికరము చూపకపోవుటచేత తన్ను కనికరించవలెనని కోరుహక్కు తనకులేదని దరఖాస్తులో గాడ్సే తెలిపెనని తెలియుచున్నది.

తన ఉరిశిక్షను యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షగా మార్చవలెనని ప్రార్థించుచు నారాయణ ఆప్టే గవర్నరు జనరలుకు దరఖాస్తు పంపుకొనెనని గూడ నేడు తెలిసినది.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.





ఇల్లినాయి యందు వరిపొలం పనివారందరిని తనతో విందుకి పిలువ నెహ్రూగారు ఘంట మ్రోగించుచున్నారు.

ఇల్లినాయిలో నూడు వరిపొలాలను నెహ్రూగారు చూచిరి. అందొక మొక్కజొన్న పొత్తును శ్రద్ధగ చూచుట.

ఇల్లినాయి రాష్ట్రంలో ఓస్వేగో గ్రామమున వరిపొలములో యంత్రం పనిచేయుట చూస్తున్న నెహ్రూ.

చికాగో నగరమునందు పండిత నెహ్రూగారు హార్వెస్టరు కంపెనీ యంత్రాగారము చూచినపుడు పనివాని "గాగిల్సు" ధరించి వానితో ప్రసంగించుట.

కనడా ప్రధానమంత్రి ఎల్. ఎస్. లారెంటుగారు, నెహ్రూ, మాజీప్రధాని మెకంజీ కింగుగార్లు శాసనసభలో నెహ్రూ ఉపన్యసించుటకు పూర్వం ప్రసంగించుట.

అట్టావాలో కెనడా శాసనసభయందు నెహ్రూగారు ఉపన్యసించుట.

ఇల్లినాయిలో ముఖ్యరయితు ఆల్బెర్టు మిగ్గెలు నెహ్రూకొసంగిన విందుకు మిగెల్ సతి పదార్థాలు తయారుచేస్తున్నవి.

—ఫోటోలు ఐ. యస్. ఐ.









